ఆంధ్ర గ్రంథమాల: ౧౮

# గీతాబోధ

(భగవద్గీతాభాష్యము)



గ్రంథకర్త:

మహాత్మ గాంధి

CL

# ఆంధ్ర గ్రంథమాలలోని పుస్తకములు

| | | | |
|---|---|---|---|
| శతకమంజరి | 1 | 8 | 0 |
| బసవపురాణము | 3 | 0 | 0 |
| బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము | 0 | 4 | 0 |
| జీర్ణవిజయనగరము | 1 | 8 | 0 |
| త్యాగరాజస్వామిచరిత్రము | 0 | 10 | 0 |
| ధమ్మపదము | 0 | 10 | 0 |
| భీష్ముడు | 1 | 0 | 0 |
| ఆత్మకథ (మొదటి భాగము) | 0 | 12 | 0 |
| ,, (రెండవ భాగము) | 1 | 0 | 0 |
| ఆంధ్రవాఙ్మయసూచిక | 3 | 0 | 0 |
| ఆంధ్రభారత కవితా విమర్శనము | 2 | 0 | 0 |
| భారతీయచిత్రకళ | 1 | 0 | 0 |
| జీవప్రభాతము | 1 | 8 | 0 |
| మేఘదూత | 0 | 12 | 0 |
| తంజాపురాంధ్రనాయకరాజచరిత్రము | 2 | 0 | 0 |
| గీతాబోధ | 0 | 4 | 0 |
| సబర్మతీ ఆశ్రమ నియమములు | 0 | 4 | 0 |
| శతకములు:—వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, నారాయణ, దాశరథి, రామతారక, రంగశాయి, రఘువీర, కాళహస్తి, రామచంద్రశతకములు 1-కి | 0 | 4 | 0 |

ఆంధ్ర గ్రంథమాల, తంబుశెట్టివీథి, మద్రాసు.

ఆంధ్ర గ్రంథమాల: పదునెనిమిదవ కుసుమము

# గీతాబోధ

## (భగవద్గీతాభాష్యము)

గ్రంథకర్త:

మహాత్మ గాంధి

అనువాదకుడు:

ఉన్నవ రాజగోపాల కృష్ణయ్య

(హిందీ ఉపాధ్యాయుడు)

౧౯౩౧

Price 4 Annas] [వెల ౪ అణాలు

# విన్నపము

శ్లో. సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.

శ్రీకృష్ణపరమాత్ముడు పార్థుని నిమిత్తమునను సజ్జనులకు గీతామృతము ననుగ్రహించినను గీతాబోధామృతాస్వాదనము సామాన్యమానవునకు దుర్లభముగ నున్నది. గీతాశాస్త్రమునకు మహానుభావు లెందరో వ్యాఖ్యానములను వ్రాసి గీతార్థములను సుగమము చేసి యుండిరి. గీతాశాస్త్రము నిత్యమైనను గీతాభాష్యములు దేశకాలపాత్రావరణములందు భాష్యకారుల సంస్కారముల కనురూపముగను భావరూపములను దాల్చుట ప్రకృతిధర్మము. జగత్తునకును, తనకును గల సంబంధమును నిర్ణయించుటయందు యోగి యైన అర్జునునకు గలిగిన విషాదము సకలజనులకును, సహజముగను ననవరతము గలుగుచున్నది. సందేహనివృత్తిని జేయుటకై ఆచార్యత్రయమును, వారిశిష్యులును, అరవిందఘోషు, తిలకుగారులు మొదలగు పండితులును వ్రాసిన వ్యాఖ్యానములు పండితులకు సుగ్రహము లైనను, సామాన్యులకు దుర్గ్రాహ్యములుగ నున్నవి. ఈ భాష్యార్ణవముల యందలి వాదప్రతివాదములు ప్రజ్ఞావాదమున కనుకూలము లైనను పరమార్థ గ్రహణమునకు ప్రజాసామాన్యమునకు దురారాధ్యములుగ నున్నవి.

౨

ఎ

గాంధిమహాత్ముడు వ్రాసిన అనాసక్తియోగము గీతార్థమును సకలజనులకును సుగమము చేయుటకు వినియోగపడుచున్నది. గీతాబోధ అనాసక్తియోగము నందలి భావార్థమును పరిస్ఫుటము చేయుటకు వినియోగించుచున్నది. గీతార్థము సంక్షోభాయత్తమైనసంగ్రామ పరముగాకను శాంతిపరమైన ఆత్మధర్మపరముగను జేయగల విధమును గాంధిమహాత్ముని వ్యాఖ్యానము సులభ గ్రాహ్యము చేయుచున్నది. "ప్రతిమానవుని హృదయమునందును, దేవాసురప్రవృత్తులకును, రామరావణ ప్రవృత్తులకును, దేహాత్మప్రవృత్తులకును, నిరంతరము జరుగుచున్న మహాసంగ్రామమును, సంగ్రామవిజయ సాధనమును" గీతాబోధ వ్యాఖ్యానము సులభగ్రాహ్యము చేయుచున్నది.

సంక్షోభపూరిత మైన వర్తమానయుగమునందు అహింసాసత్యసాధనమునను ఆత్మసామ్రాజ్యస్థాపనమునకు దీక్షను బూనిన గాంధిమహాత్ముని గీతాబోధ వ్యాఖ్యానము సకలజనులకును ఆత్మోపలబ్ధికిని పరనార్థముగ నున్నది. ఈ గ్రంథమున కాంధ్రానువాదముచేసి ఆంధ్ర గ్రంథమాలయందు పదునెనిమిదవ కుసుమముగను ప్రచురింపించిన శ్రీయుత ఉన్నవ రాజగోపాల కృష్ణయ్యగారికి ప్రకాశకులు కృతజ్ఞులు.

ఆంగీరస సం. ఆశ్వయుజ
బ. సప్తమి శుక్రవారము.

కా. నాగేశ్వరరావు.

# విషయసూచిక

# అనువాదకుని విజ్ఞాపనము

శ్రీ మహాత్మ గాంధిగారు 1929-వ సంవత్సరమున శ్రీమద్భగవద్గీతానువాదమును అనాసక్తియోగ మను పేర గుజరాతిభాషయందు వ్రాసిరి. అనాసక్తియోగము శ్రీమద్భగవద్గీతయందలి ప్రతిశ్లోకమునకును ప్రతిశబ్దమునకును అనువాద మగుటచే సులభముగ విషయము బోధపడుటలే దని యొకరిద్దఱు సోదరులు మహాత్మునకుఁ దెలుపుటచే విషయమును సుబోధ మొనర్చుట కీగీతాబోధను 1930-31 సంవత్సరములలో ఎఱవాడచెఱసాలయం దుండినపుడు వ్రాసిరి.

ఈ గ్రంథము హిందీభాషయందలి గీతాబోధ కనువాదము. గీతను సులభముగ నర్థము చేసికొనుటకు సహకారిగ నుండు నని అనాసక్తియోగమునందలి ఉపోద్ఘాత మీ గ్రంథమునఁ జేర్పఁబడినది.

ఆంధ్రజాతీయకళాశాలోపాధ్యాయులగు శ్రీయుత చల్లపల్లి కృష్ణమూర్తిగారీ యనువాదమును చేయుటకు నన్ను ప్రోత్సహించి సర్వవిధముల సాయము చేసినందుకు నే నెంతయు కృతజ్ఞుఁడను.

ఈపుస్తకమున కగు వ్యయ మంతయు తామే భరించి, ప్రచురించి ఆంధ్రలోకమున కందఁజేసి, మహోపకార మొనర్చిన శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి నా వందన సహస్రములు.

గాంధిమహాత్ముఁడు వ్రాసిన “సబర్మతీ-ఆశ్రమ నియమములు” అను గ్రంథమును నేను తెనిఁగింపఁగా శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు ప్రచురించిరి. ఆ గ్రంథము గీతను, గాంధిమహాత్ముని

భావములను గ్రహించుటకు మిక్కిలి సహకారిగా నుండు నని విన్న వించుచున్నాను.

సత్యసంధుఁడును, అహింసావ్రతధారియు, భక్తిజ్ఞానసంపన్నుఁడును, కర్మవీరుఁడును, లోకసేవాతత్పరుఁడును, ప్రజానాయకుఁడును, దేశాభిమానియు, దీనరక్షకుఁడును, ధైర్యసాహసాది సద్గుణసంపన్నుఁడు నగు మహాత్మ గాంధి రచించిన యీ గీతాబోధను ఆంధ్రసోదరసోదరీ మణు లెల్లరును పఠించి కృతార్థు లయ్యెదరుగాత! శ్రీ కృష్ణభగవానుఁడు గాంధిమహాత్మున కాయురారోగ్యైశ్వర్యాదుల నొసంగి వారి మహోన్నతభావములను ప్రపంచమం దంతటను వ్యాపింపఁజేయుఁగాక.

ఆంధ్రజాతీయకళాశాల
మచిలీపట్టణము.
24—9—1932

ఇట్లు విన్నవించు : బుధజనవిధేయుఁడు,
ఉన్నవ రాజగోపాల కృష్ణయ్య,
హిందీ-ఉపాధ్యాయుఁడు.

# 1

## అనాసక్తియోగమున కుపోద్ఘాతము

క్రీ. శ. 1888-89 సంవత్సరమున భగవద్గీతను ప్రప్రథమమున చదివితిని. అప్పుడే యిది చరిత్రాత్మక మగు గ్రంథము గా దనియు, భౌతికయుద్ధవర్ణన మను నెపముతో ప్రతి మానవుని హృదయమందును నిరంతరము జరుగుచున్న ద్వంద్వయుద్ధముయొక్క వర్ణన మని నాకు గోచరించెను. హృదయమందు జరుగు పోరాటమును చిత్తరంజకముగాఁ జేయుటకే యీ మానుషయోధుల చరిత్ర కల్పింపఁబడినది. ధర్మమును, గీతను బాగుగా మననముచేసినపిమ్మట నీ యభిప్రాయమే స్థిరపడినది. మహాభారతమును జదివినపిమ్మట నీయభిప్రాయమే మఱింత దృఢపడినది. మహాభారతమును వ్యావహారికార్థముప్రకార మొకచరిత్ర యని తలఁచను. ఈ యభిప్రాయమునకు ప్రబల కారణము లాది పర్వమునందే లభింపఁగలవు. పాత్రల నమానుషులుగాను మానవాతీతులుగాను వర్ణించి, వ్యాసు లిది సామాన్యరాజుల చరిత్ర యను భ్రమను తొలఁగించెను. భారతమున వర్ణింపఁబడిన పాత్రలు చరిత్రాత్మకమగు పురుషులు కావచ్చును. కాని వ్యాసులాపాత్రలను కేవలము ధర్మోపదేశము చేయుటకే యుపయోగించెను.

మహాభారతకారుఁడు భౌతికయుద్ధావశ్యకమును స్థిరపఱచలేదు. యుద్ధానర్థమునే స్థిరపఱచెను. జయము పొందినవారేడ్చిరి, పశ్చాత్తాపపడిరి. వారికి దుఃఖానుభవము తప్ప మఱేమియు మిగులలేదు.

ఈ మహాగ్రంథమున గీత శిరోమణిగా విరాజిల్లుచున్నది. దానిలో రెండవయధ్యాయమందు భౌతికయుద్ధకౌశలము నేర్పుటకు బదులు స్థితప్రజ్ఞుని లక్షణములు చెప్పఁబడినవి. భౌతికయుద్ధముతో స్థిరప్రజ్ఞుని కేమియు సంబంధము లేదు. ఈవిషయ మాతని లక్షణములను

బట్టియే తెలియుచున్నది. సాధారణమైన దాయాదుల పోరాటము యొక్క యుచితానుచితములను నిర్ణయించుటకు గీతవంటి మహాగ్రంథ మును వ్రాయుట అసంభవము.

గీతయందలి కృష్ణుఁడు శుద్ధ సంపూర్ణజ్ఞానమూర్తి, కల్పిత పురుషుఁడు. దేహధారియగు కృష్ణావతారమునకు స్థానము లేకపోలేదు. సంపూర్ణకృష్ణుఁడు కేవలము కల్పితపురుషుఁడు. సంపూర్ణావతార మని తర్వాత నారోపింపఁబడినది.

అవతార మనఁగా దేహధారియగు నొకవ్యక్తి. ప్రతి ప్రాణియు నీశ్వరావతారమే; కాని వ్యావహారిక భాషలో ప్రతిజీవుని అవతార మని పిలువము. తమ యుగములో నెవఁడందఱికంటెను ధర్మపరాయ ణుఁడో అతనినే భావిసంతతి భగవదవతారముగ భావించి పూజిం చును. దీనిలో నా కేమియు దోషము కాన్పింపదు. ఈ యాచరణము వలన ఈశ్వరుని గొప్పతనమునకు లోపము రాదు. సత్యమునకు విఘ్న మాపాదింపదు. "ఆదాము దేవుఁడు కాఁడు, కాని దేవుని ప్రతిభకంటె ఆదాము భిన్నుఁడు గాఁడు". తమ యుగములో నెవని యం దందఱికంటెను ధర్మానుష్ఠాన మధికముగఁ గలదో అతనినే భగవ దవతార మని తలఁచెదరు. ఈ దృష్టితో సంపూర్ణ భగవదవతార మని కృష్ణుఁడు హిందూధర్మమునం దగ్రస్థానము నలకరించియున్నాఁడు.

ఈ దృశ్యము మానవుని యున్నతాదర్శ సూచకముగ నున్నది. ఈశ్వరస్వరూపమును పొందినఁగాని మానవునికి తృప్తియు శాంతియు లభింపవు. ఈశ్వరరూపమును బొందుటకు ప్రయత్నించుటయే మాన వుని నిజమైన యాదర్శమును, పురుషార్థము నై యున్నది. అదియే ఆత్మదర్శనము. అన్ని ధర్మగ్రంథములందలి విషయమును ఆత్మదర్శ నమే. గీతయందలి విషయము గూడ నిదియే. కాని గీతాకారుఁ డీవిష యమును ప్రతిపాదించుటకు మాత్రమే గీతను వ్రాసియుండలేదు.

కాని ఆత్మార్థి కాత్మదర్శనప్రాప్తికై యొక యద్వితీయమార్గమును జూపించుటయే గీతయొక్క యుద్దేశ్యము. హిందూధర్మ గ్రంథములందక్కడక్కడయున్న విషయములను గీత యనేకరూపములుగ అనేక శబ్దములఁ బునరుక్తిదోషము గలిగినను బాగుగ బోధించుచున్నది.

అద్వితీయ మగు నీయుపాయము కర్మఫలత్యాగము. కర్మఫలత్యాగము కేంద్రభావముగ నుంచికొని గీత రచింపఁబడినది. భక్తి, జ్ఞానము మొదలగునవి దానిచుట్టు నక్షత్రములవలెఁ గూర్పఁబడినవి. శరీరధారికి కర్మము తప్పదు. కర్మమునుండి యెవరును దప్పించుకొనఁ జాలరు. కర్మమును జేసియే తీఱవలయును. అయినప్పటికిని శరీరమును దేవమందిరముగఁ జేసికొని దానిద్వారా ముక్తినిఁ బొందవచ్చును. ఈవిషయ మన్నిధర్మగ్రంథములందును ప్రతిపాదింపఁబడినది; కాని ప్రతికర్మమును దోషయుక్త మైనది. ముక్తి నిర్దోషునకు మాత్రమే లభింపఁగలదు. కర్మబంధమునుండి, పాపమునుండి తప్పించుకొనుటెట్లు? దీనికి ప్రత్యుత్తరము గీత స్పష్టముగఁ జెప్పినది. "నిష్కామ కర్మము చేయుము. యజ్ఞార్థము కర్మమును జేయుము. కర్మఫలత్యాగమును జేయుము. అన్ని కర్మములను కృష్ణార్పణబుద్ధితోఁ జేయుము. మనోవాక్కాయముల నీశ్వరునియందు హోమము చేయుము." అని

కాని కర్మఫలత్యాగశక్తి—నిష్కామత—మాటలతోఁ గలుగఁ జాలదు. ఇది కేవలము బుద్ధికుశలతవలనఁ గలుగదు. ఇది హృదయ మథనమువలననే కలుగును. ఈ త్యాగశక్తి గలుగుటకు జ్ఞానమును సంపాదింపవలయును. ఒకవిధమగు శుష్కజ్ఞానము, చాలమంది పండితులు సంపాదింతురు. వేదాదిగ్రంథములను కంఠస్థముగఁ జేయుదురు. కాని వారిలోఁ జాలమంది భోగలాలసు లైయుందురు. జ్ఞానమునకు భిన్నమగు శుష్కపాండిత్యమునకు ప్రాధాన్య మియ్యక గీతాకారుఁడు

జ్ఞానముతోఁగూడ భక్తిని గలిపి భక్తికే ప్రాధాన్య మొసఁగెను. భక్తి లేనిజ్ఞాన మనర్థదాయకము. కనుకనే "భక్తి గలిగిన జ్ఞానము తప్పక కలుగును" అని బోధించెను. కాని భక్తి తల నొడ్డుట వంటిది. కనుక భక్తుని లక్షణములు స్థితప్రజ్ఞుని వంటివే యని గీతాకారుఁడు నుడివెను.

గీత చెప్పిన భక్తి యంధవిశ్వాసము గాదు. బాహ్యాడంబరము గాదు. గీతయందు బోధింపఁబడిన నడవడికిని ఋుధుని బాహ్యాచారము నకును జాల తక్కువసంబధ మున్నది. జపమాల, అర్ఘ్యము, బొట్టు మొదలగు సాధనములను భక్తుఁ డుపయోగించుఁగాక; కాని యీ బాహ్యచిహ్నములే భక్తుని లక్షణములు గావు. ఎవఁ డెవనిని ద్వేషింపఁడో, ఎవఁడు దయాళుఁడో, ఎవని కహంకార మమకారములు లేవో, ఎవనికి శీతోష్ణములును, సుఖ దుఃఖములును సమానములో, ఎవఁడు క్షమాశీలుఁడో, నిత్యసంతోషియో, ఎవనికి స్థిరబుద్ధి గలదో ఎవఁడు మనోబుద్ధుల నీశ్వరార్పణము చేసినాఁడో, యెవనివలన ప్రజలు భయభ్రాంతుల నొందరో, ఎవఁడు నిర్భయుఁడో, ఎవఁడు భయశోకహర్షములనుండి ముక్తుఁడో, ఎవఁడు పవిత్రుఁడో, ఎవఁడు కార్యదీక్ష కలవాఁ డైయుండియు నిరభిమానుఁడో, ఎవఁడు శుభాశుభములను, మానావమానములను, శత్రుమిత్రులను, నిందాస్తుతులను సమానముగఁ జూచునో, ఎవఁడు మౌనధారియో, ఎవఁ డేకాంతవాసాభిలాషియో, ఎవనికి నిశ్చయాత్మక బుద్ధి గలదో వాఁడే భక్తుఁడు. ఈ భక్తి యహంకారమమకారములుగల స్త్రీపురుషులయం దుండుట యసంభవము.

దీనివలన తేలినసారాంశ మే మన, జ్ఞానము గలుగుట, భక్తుఁడగుటయే ఆత్మదర్శనము. ఆత్మసందర్శనము వేఱొకటి గాదు. ఒక రూపాయ నిచ్చి విషమును గాని, అమృతమును గాని కొనుటకు వీలైనట్లు భక్తిజ్ఞానములు బంధమునకుఁగాని మోక్షమునకుఁగాని సమాన

ముగ సాధనము లగుటకు వీలు లేదు. సాధనసాధ్యము లీసందర్భము నందు పూర్ణముగ నొకటేయని చెప్పవచ్చును. సాధనయొక్క పరమావధియే మోక్షము. మోక్షమన, గీతార్థము, పరమశాంతి—నిత్యము, సత్యము నగు ఆనందము.

ఈ విధమగు భక్తి జ్ఞానములను కర్మఫలత్యాగ మను నొరపిడి రాతిమీఁదను పరీక్షింపవలెను. వ్యవహారమున శుష్కపండితుఁడు గూడ జ్ఞానిగ నెంచఁబడుచున్నాఁడు. వానివలన నేపనియుఁ గాదు. చేతితో చెంబందియిచ్చుట గూడ నతని దృష్టిలోఁ గర్మబంధ మగును. యజ్ఞశూన్యుఁడు-లోకసంగ్రహార్థము పని చేయనివాఁడు—జ్ఞానిగా నెంచఁబడుచున్నపుడు చెం బందిచ్చుటవంటి యల్పకర్మమునకు స్థానమె ట్లుండును?

సామాన్యముగ భక్తుఁ డన బాహ్యాచారి; (బాహ్యాచరణమందు లీన మైయుండి దానినే భక్తి యని శుద్ధభావముతో నమ్మును) జపమాలతో జపము చేయువాఁ డని తలఁచెదరు. సేవ చేయుట కైనను జపమాలను వదలిన వ్రతభంగ మగు నని తలఁచును. కాన భోజనపానాదులను గ్రహించునపుడే జపమాలను వదలును. తిరుగలిని విసరుటకుఁ గాని, రోగికి సేవ చేయుటకుఁ గాని, జపమాల నెన్నఁడునువదలఁడు.

ఈ రెండు తరగతులవారికిని గీత స్పష్టముగ బోధించున దేమన: కర్మము చేయకుండ నెవరును మోక్షమును బొందలేరు. జనకాదులు గూడ కర్మమువలననే జ్ఞాను లైరి. నేను గూడ సోమరినై కర్మమును జేయనియెడల లోకము నాశన మగును. ఇఁక మనుష్యుని విషయమునఁ జెప్ప నేల?

ఒక దృష్టితోఁ జూచిన కర్మము మాత్రము బంధనరూప మైనదను విషయము నిర్వివాదాంశము. రెండవ దృష్టితోఁ జూచిన శరీరధారి యిష్ట మున్నను లేకున్నను కర్మమును జేయుచునే యుండును.

శారీరక, మానసికము లగుచేష్ట లన్నియు కర్మములే. అయితే కర్మమును జేయుచును మానవుఁడు బంధవిముక్తుఁ డెట్లగును? నాకుఁ దెలిసినంతవఱకు నీ విషమ సమస్యను గీత పరిష్కరించినట్లు మఱియొక గ్రంథము పరిష్కరింపలేదు. గీత చెప్పిన దే మన "ఫలాసక్తి విడిచి కర్మమును జేయుము. ఆశారహితుఁడవై కర్మమును జేయుము. నిష్కాముఁడవై కర్మమును జేయుము." ఈవిషయము మఱచుటకు వీలులేనట్లు ఘంటాపథముగఁ జాటుచున్నది. కర్మమును వదలువాఁడు పతితుఁ డగును. కర్మమును జేయుచు ఫల మాశింపనివాఁడు మోక్షమార్గమునఁ బోవును.

ఫలత్యాగికి ఫలము లభింప దని యర్థము చేయ కుందురుగాక. ఈ యర్థమునకు గీతయందు స్థానమే లేదు. ఫలత్యాగ మన ఫల విషయమున ఆసక్తి లేకుండుట. వాస్తవముగ ఫలత్యాగికి వేయిరెట్లధికముగ ఫలము లభించును. గీతయందుఁ జెప్పిన ఫలత్యాగ మపరిమితమగు శ్రద్ధ యున్నది లేనిది పరీక్షించును. ఎవఁడు ఫలితమును గుఱించియే సదా యాలోచించునో వాఁడనేకపర్యాయములు కర్మ(కర్తవ్య)భ్రష్టుఁడగును. వాఁడు వ్యాకులమునఁ జెందును. అస్థిరుఁడగును. అధీరుఁడగును. దానివలన క్రోధమునకు వశుఁ డగును. చేయరాని దుష్కార్యములుగూడ జేయును. ఒక కర్మమునందుండి మఱియొక కర్మములోనికి, రెండవ కర్మమునుండి మూఁడవకర్మము లోనికి దిగును. పరిణామము నే చింతించువాని గతి విషయాంధుని బోలి యుండును. చివరకు విషయాంధుని వలె సారాసారములను, నీతి యవినీతులను, వివేకమును కోల్పోయి ఫలప్రాప్తికై తన మనస్సునకుఁ దోఁచిన సాధనముల నుపయోగించి దానినే ధర్మమని తలఁచును. ఫలాపేక్షవలనఁ గలుగు నిట్టి దుష్పరిణామములనుండి తప్పించుకొనుటకు గీతాకారుఁ డనాసక్తి యనఁగా ఫలత్యాగ సిద్ధాంతమును స్థాపించి దానిని మనోరంజక మగు భాషను లోకమునకు వెల్ల

డిచేసెను. సాధారణముగ ధర్మార్థములు పరస్పరవిరుద్ధము లని తలంచెదరు. వ్యాపారము మొదలగు లౌకికవ్యవహారములందు ధర్మమును పాలించుట దుష్కరమనియు వీనిలో ధర్మమునకు స్థానము లే దనియు ధర్మముయొక్క యుపయోగము మోక్షప్రాప్తికొఱకే యనియు ధర్మముచోట ధర్మమును, అర్థముచోట నర్థమును రాణించుననియు సాధారణముగ తలంచెదరు. గీతాకారుం డీభ్రమను తొలగించెనని నా యుద్దేశ్యము. మోక్షమునకును, వ్యవహారమునకును మధ్య నిటువంటి భేదమును కల్పింపలేదు. మీఁదుమిక్కిలి ధర్మమునే వ్యవహారమునందు పరిణమింపఁజేసెను. నిత్యవ్యావహారికజీవనములోనికి రాని ధర్మము ధర్మమే కాఁజాలదు. ఈసూచన గీతయం దున్న దని నా యభిప్రాయము. అనఁగా గీతాభిప్రాయ ప్రకార మేకర్మములను ఆసక్తి మమకారము లేకుండఁ జేయ వీలులేదో యా కర్మములన్నియు త్యాజ్యములే యని తేలుచున్నది. ఇట్టి సువర్ణనియమము మానవున నేక ధర్మ సంకటములనుండి కాపాడును. ఈ యభిప్రాయానుసారముగ హత్య, అబద్ధము, వ్యభిచారము మొదలగు దుష్కర్మములన్నియు తమంతట తామే త్యాజ్యము లగును. మానవజీవితము సులభ మగును. దానినుండి శాంతి వెలువడును. ఫలత్యాగ మనిన పరిణామవిషయమున నజాగ్రత్తగా నుండుట యని యర్థముచేయరాదు. సాధనపరిణామములయొక్క వివేచన, జ్ఞానము కలిగి యుండవలసినదే. ఈ వివేకము గలిగియుండియు పరిణామవిషయమున నాతురత లేకుండ సాధనయందే తత్పరుం డైయుండువాఁడే ఫలత్యాగి.

ఈదృష్టితోఁ జూచిన గీతోపదేశ మాచరణమందుఁ బెట్టువానికి సత్య-అహింసల పాలన చేయవలసివచ్చునని నాకు గోచరించుచున్నది. ఫలాసక్తి లేనియెడల మానవుల కసత్యము పలుకుటయందుఁ గాని, హింస చేయుటయందుఁగాని వ్యామోహ ముండదు. ఏ హింసాకార్య

మును గాని, అసత్యకార్యమును గాని పరిశీలించినయెడల దానికి మూలకారణము-ఆధారము-ఫలాపేక్షయే యని తెలియును. కాని అహింసాసిద్ధాంతమును ప్రతిపాదించుట గీతయొక్క విషయము గాదు. గీతాకాలమునకు పూర్వమే అహింస పరమధర్మ మని తలఁపఁబడుచుండెను. అనాసక్తిసిద్ధాంతమును ప్రతిపాదించుటయే గీతయొక్క ముఖ్యోద్దేశ్యము. రెండవయధ్యాయమునందే యీవిషయము స్పష్టపడుచున్నది.

గీతకు అహింసాసిద్ధాంతము మాన్య మైనయెడల, అనాసక్తియోగమునందు స్వతస్సిద్ధముగనే అహింస యిమిడియున్నయెడల గీతాకారుఁడు భౌతికయుద్ధము నుదాహరణముగ నైనను ఎందులకు తీసికొనవలయును? గీతాయుగమం దహింసాధర్మ మంగీకరింపఁబడినను భౌతికయుద్ధ మాకాలమున సర్వసామాన్య మగు విషయ మగుటచే గీతాకారున కిట్టియుదాహరణమును గైకొనుటయం దెట్టిసంకోచమును కలుగలేదు. అట్టిసంకోచము గలుగుట కవకాశమును లేదు.

అయితే ఫలత్యాగమాహాత్మ్యముయొక్క విలువ కట్టుటయందు గీతాకారుని మనస్సునం దేభావ ముండునో, అహింసకు హద్దెంతవఱకు నిశ్చయించెనో యను నీవిషయములను గూర్చి విచారింప మన కవసరము లేదు. కవి మహత్తర మైనసిద్ధాంతములను ప్రపంచమునెగుట నుంచును. దీనినిబట్టి యా కవికి తాను ప్రతిపాదించిన సిద్ధాంతముల పూర్ణజ్ఞానము సదా కలదని కాని, లేక కలిగిన జ్ఞాన మంతటిని భాషయందు వ్యక్తీకరింపఁగలఁ డని కాని చెప్ప వీలు లేదు. ఇది యంతయు కావ్యముయొక్కయు, కవియొక్కయు మహిమ. కవియొక్క-అర్థగాంభీర్యమునకు, భావవైశాల్యమునకు నంతము లేదు. మానవునివలెనే మహావాక్యముల-అర్థము గూడ వికాసమును బొందుచుండును. భాషల చరిత్రను పరిశీలించినయెడల అనేకమహాశబ్దముల యర్థము నిత్య మనేక

పరిణామములను జెందుచుండు నని తెలియును. గీతార్థవిషయమునఁ గూడ నిటులే జరగుచు వచ్చినది. గీతాకారుఁడు స్వయముగనే కఠిన శబ్దముల నర్థమును విశదము చేసెను. ఈ విషయము గీతను పైపైనఁ జూచినప్పటికిని తెలియనగును. గీతాయుగమునకు పూర్వము యజ్ఞము నందు పశుహింస సమ్మత మైయుండవచ్చును; కాని గీతయందు చెప్పఁబడిన యజ్ఞమందు హింస లేశ మైనను లేదు. దానియందు యజ్ఞములలో కెల్ల జపయజ్ఞము శ్రేష్ఠ మని చెప్పఁబడినది. మూఁడవ యధ్యాయమునందు యజ్ఞమును పరోపకారార్థము శరీరము నర్పించుట యని చెప్పఁబడినది. మూఁడవనాల్గవ యధ్యాయములను పరిశీలించినచో యజ్ఞశబ్దమునకు విశేషార్థములను తీయవచ్చును గాని పశుహింస యని యర్థము చేయఁజాలము. గీతయందున్న సన్న్యాసశబ్దార్థవిషయమునఁ గూడ నీరీతిగనే యున్నది. సన్న్యాసశబ్దమున కర్థము, కర్మత్యాగము గాదు. గీతయందుఁ జెప్పఁబడినసన్న్యాసి కర్మమందు నిరంతరము నిమగ్నుఁ డైనను అకర్మిగ, కర్మబంధము లేనివాఁడుగ నెంచఁబడును. ఈ విధముగ గీతాకారుఁడు మహాశబ్దములకు వ్యాపకార్థమును జేయుట నేర్పినాఁడు. గీతాకారుని భాషయందలి శబ్దములకు సంపూర్ణకర్మఫల త్యాగి భౌతికయుద్ధమును జేయవచ్చు నను నర్థము దీయవచ్చు నేమో కాని గీతోపదేశమును సంపూర్ణముగ నాచరణమం దుంచుటకు నలువదిసంవత్సరములనుండి సతతము ప్రయత్నించుచున్న మీఁదట సత్యము, నహింసాధర్మమును, సంపూర్ణముగ ననుష్ఠింపనిది, సంపూర్ణకర్మఫలత్యాగము మానవున కసంభవ మని నాకు గోచరించుచున్న దని నేను వినయపూర్వకముగ మనవిచేయుచున్నాను.

గీత సూత్రగ్రంథము గాదు. ఇది మహత్తరమైన యొక ధర్మకావ్యము. దానిలో లోఁతునకు దిగినకొలఁది సుందరములగు క్రొత్త భావములు దొరకును. గీత జనసామాన్యమునకై రచియింపఁబడినది.

ఒకటే విషయ మనేకవిధములుగఁ జెప్పఁబడినది. కనుక గీతయందలి మహాశబ్దముల యర్థము యుగయుగమునందును మాఱుచును విస్తృత మగుచు నుండును. గీతయొక్క మూలమంత్ర మెన్నటికిని మాఱఁజాలదు. ఆ మంత్రమును జిజ్ఞాసువు ఏ విధముగ సిద్దిని బడయఁగోరునో యావిధముగ దాని కర్థమును గల్పించుకొనును (అనాసక్తిని పొందుటకు భక్తుఁడు భక్తి ప్రధాన మనియు, జ్ఞాని జ్ఞానము ప్రధాన మనియు, కర్మయోగి కర్మము ప్రధాన మనియు తలఁచును.)

గీత విధినిషేధములను దెలుపునదియుఁ గాదు. ఒకనికి విహితమైనది మఱొకనికి నిషిద్ధము గావచ్చును. ఒకదేశమునం దొకయుగమున విహితమైనది మఱియొక దేశమున మఱియొక యుగమునందు నిషిద్ధము గావచ్చును. ఫలాసక్తియే నిషిద్ధము. అనాసక్తియే విహితము. గీతయందు జ్ఞానముయొక్క మహిమ సురక్షితముగ నున్నది. అయినను గీత బుద్ధిగమ్యము గాదు, హృదయగమ్యము. అందుచే నది శ్రద్ధావిహీనులకొఱకుఁ గాదు. గీతాకారుఁడే యిట్లు చెప్పెను.

"తపస్వి కాని వానికిని, భక్తుఁడు గాని వానికిని, విన నిచ్ఛ లేనివానికిని, నన్ను ద్వేషించువానికిని ఈజ్ఞానమును నీ వెప్పుడును చెప్పకుము" ౧౮ అ. ౬౭ శ్లో.

"ఈ పరమ జ్ఞానమును నా భక్తులకు బోధించినవాఁడు నాయందు పరమభక్తిగలవాఁడై నిస్సందేహముగ నన్నే పొందును." ౧౮ అ. ౬౮

"ఏ మానవుఁడు ద్వేషరహితుఁడై శ్రద్ధాపూర్వకముగ దీనిని వినునో వాఁడుగూడ మోక్షమును బొంది పుణ్యపురుషులు నివసించెడి శుభలోకమును బొందును." ౧౮ అ. ౭౧ శ్లో.

కౌసాని (హిమాలయము) } మోహనదాస్ కరంచందు గాంధి,
ఆషాఢ బ. ౨-౧౯౮౬ } సోమవారము, 24-6-1923.

# గీతాబోధ

## ప్రథమాధ్యాయము

### అర్జునవిషాదయోగము

భగవద్గీత మహాభారతమునం దొకచిన్న భాగము. మహాభారత మొక యితిహాస మందురు. కాని మహాభారతము, రామాయణము ఇతిహాసములు కావని నాయభిప్రాయము. అవి ధర్మగ్రంథములు, ఇతిహాసము లనినచో ఆత్మయొక్క యితిహాసము లని చెప్పఁదగును. వేలకొలఁదిసంవత్సరముల క్రిందట జరిగిన యుద్ధము వర్ణనము గాక నేఁడు ప్రతిమనుష్యునిహృదయమందును జరగుచున్న యుద్ధమే మహాభారతమందు వర్ణింపఁబడినది. భారతరామాయణములు రెంటియందును, దేవాసురులకును, రామరావణులకును నిత్యము జరగుచున్న మహాయుద్ధమే వర్ణింపఁబడినది.

భగవద్గీతయందు కృష్ణార్జునులసంవాదము గలదు. ఇది అంధుఁడగు ధృతరాష్ట్రునకు సంజయునిచేతఁ జెప్పఁబడెను. గీత యనఁగా గానము చేయఁబడినది. ఇందు ఉపనిషచ్ఛబ్ద మధ్యాహార్యము. అనఁగా గానము చేయఁబడిన ఉపనిషత్తని సంపూర్ణార్థము. ఉపనిషత్తనఁగా జ్ఞానబోధ. గీత యనఁగా శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ గావించిన జ్ఞానోపదేశము.

# గీతాబోధ

శ్రీకృష్ణభగవానుఁడు మన అంతఃకరణములయందు విరాజిల్లుచున్నాఁడని తెలిసికొని గీతాపారాయణము చేయవలయును. అర్జునునివలె జిజ్ఞాసువులమై ధర్మసంకటములయం దంతర్యామి యగు భగవంతుని ప్రశ్నించునపుడు, శరణు చొచ్చినపుడాయన మనకు తెలియఁజెప్పుటకు సిద్ధముగా నుండును. మనము నిద్రించియున్నాము గాని మనయందుండు అంతర్యామి మేలుకొనియున్నాఁడు. అతఁడు మనలో జిజ్ఞాస యెప్పుడు గలుగునా యని యెదురు చూచుచున్నాఁడు. ఆయన నెట్లు ప్రశ్నింపవలయునో మన మెఱుంగము. ప్రశ్నింపవలయు ననునిచ్ఛగూడ మనకు లేదు. కనుకనే మనము గీతాపఠనమును చేయుచున్నాము. ఇట్లు గీతాపారాయణము చేయుచు మనయందు ధర్మజిజ్ఞాసను పెంపొందించుకొనఁ గోరుచున్నాము. ప్రశ్నించుటను నేర్చుకొనఁ దలఁచుచున్నాము. కష్టమునం దున్నపుడెల్ల సంకటములను తొలఁగించుకొనుటకు గీతాసాహాయ్యమును గోరుచున్నాము. దానివలన శాంతిని పొందుదుము. ఈదృష్టితో గీతను చదువవలయును. ఇది మనసద్గురువు, మనతల్లియు నయియున్నది. ఆమెయొడిలో తల దాఁచుకొనిన మనకు శాంతి కలుగు నని విశ్వాసము కలిగియుండవలయును. గీతవలన మనధర్మసంశయము లన్నియు విరిసిపోవును. ఈవిధముగా గీతామననము గావించువారికి నిత్యము నూతన మైన యానందము జనించును. క్రొత్తక్రొత్త అర్థములు స్ఫురించును. గీత తీర్పఁజాలని ధర్మసంశయ మొక్కటేనియు లేదని చెప్పఁదగును. మనకు దానియందు తగినంతవిశ్వాసము లేకపోవుట వలన, దానిని చదువుట, తెలిసికొనుట రుచింపనిచో అది వేఱుమాట. మనశ్రద్ధ వృద్ధియగుటకును, మనము సావధానులమై యుండుటకును గీతాపారాయణము చేయుచున్నాము. ఈవిధముగా గీతామననము

చేయఁగా నాకు దానినుండి లభించిన అర్థముయొక్క సారాంశమును ఆశ్రమవాసులసాహాయ్యముకొఱకై యీక్రింద వ్రాయుచున్నాను.

“పాండవులును,కౌరవులును తమసేనలను తీసికొని యుద్ధభూమి యగు కురుక్షేత్రమునకు వెళ్లి నిలిచియుండిరి. అప్పుడు కౌరవుల రాజగు దుర్యోధనుఁడు ద్రోణాచార్యులతో రెండుసేనలం దున్న ముఖ్యయోధులను వర్ణించి చెప్పెను. యుద్ధమునకు సిద్ధము కాఁగానే రెండుపక్షములవారును తమతమశంఖములను పూరించిరి. అర్జునుని సారథియగు శ్రీకృష్ణభగవానుఁ డర్జునునిరథమును రెండుసేనలమధ్యను నిలిపెను. యుద్ధసన్నద్ధు లైన యుభయసేనలను జూచి అర్జునుఁడు కలవరపడి భగవంతు నిట్లు ప్రశ్నించెను!

“వీరితో నే నెట్లు పోరాడుదును? ఇతరులతో నైనచో పోరాడుటకు నే నిప్పుడే సంసిద్ధముగా నున్నాను. కాని వీరు స్వజనులు. నావారు. కౌరవు లెవరు? మే మెవరము? అన్నదమ్ముల బిడ్డలమేకదా! మే మెల్లరము నొకచోటనే పెరిఁగితిమి. ద్రోణాచార్యులు కేవలము కౌరవులకుమాత్రమే గురువుకాక మాకుఁగూడ వారే సర్వవిద్యలను నేర్పియుండిరి. భీష్ముఁడు మాఅందఱకును కులగురువు. వారితో యుద్ధము చేయు టెట్లు? కౌరవులు దుష్టు లనుమాట నిజము. వా రెన్నియో దుష్కార్యములను చేసియుండిరి. మాకు చాల అన్యాయము చేసిరి. మాయొక్క రాజ్యమును కాఁజేసిరి. ద్రౌపదివంటి మహాపతివ్రతను అవమానపఱిచిరి. ఇవి యన్నియు వారు చేసినదోషము లే. వారినిచంపి నే నెచ్చటికి పోవుదును? వారు మూఢులు, వారితో నేను సమానుఁడ నెట్లగుదును? నాకు కొంచెము జ్ఞానముకలదు. సారాసార వివేకము కలదు. కనుక నావారితో, నా బంధువులతో పోరాడుట పాప మని నేను తెలిసికొనవలయును వారు మారాజ్యభాగమును మ్రింగ

దక్కుగాక. వారు మమ్ములనుచంపెదరుగాక. కాని వారిపై మేము చేయి చేసికొనము. ఓకృష్ణా, మే మీ బంధువర్గముతో పోరాడఁజాలము. ఇట్లు చెప్పి స్పృహతప్పి అర్జునుఁడు తనరథముపైని చదికిలఁబడెను."

ఈవిధముగా మొదటియధ్యాయము సమాప్త మగును. ఈ యధ్యాయముపేరు అర్జునవిషాదయోగము. విషాద మన దుఃఖము. అర్జునునకు దుఃఖము కలిగినట్లు మన కందఱకును కలుగవలయును. ధర్మవేదన, ధర్మజిజ్ఞాస లేనిది జ్ఞానము కలుగదు. మంచిచెడుగలు తెలిసికొనవలయు నని కోరికయే లేనివానికి ధర్మోపదేశమువలన ప్రయోజన మేమి? కురుక్షేత్రయుద్ధము నిమిత్తమాత్రము. నిజ మైన కురుక్షేత్రము మనశరీర మే. ఇది కురుక్షేత్రము, ధర్మక్షేత్రముగూడ నై యున్నది. దీనిని మన మీశ్వరుని నివాసస్థాన మని తలఁచి యతని కర్హ మైనదిగాఁ జేసిన నిది ధర్మక్షేత్రము కాఁగలదు. ఈక్షేత్ర మందు మనసమక్షమున ప్రతిదినము, ఏదో యొకయుద్ధము జరగుచునే యున్నది. అట్టియుద్ధమునకు ముఖ్యకారణము, ఇది నాది, అది నీది, వీరు స్వజనులు, వారు పరజనులు, అనుభేదభావ ముండుటయే. భగవంతుఁ డర్జునున కధర్మ మంతటికి మూలకారణములు రాగద్వేషములని చెప్పెను. నాది యనుకొంటివా రాగము కలిగిన దని చెప్పవచ్చును. ఇతరులదని తలఁచిన దానియందు ద్వేషము కలుగుచున్నది. వైరభావము జనించుచున్నది. కనుక "నా, నీ" భేదములు మఱవఁదగినవి. రాగద్వేషములు త్యాజ్యములు. గీతయు, మఱియు సర్వమతగ్రంథములు నీవిషయమునే యెలుఁగెత్తి చాటుచున్నవి. ఇదిచెప్పుట సుకర మే కాని అనుసరించుట కష్టము. చెప్పుటవేఱు; చేయుటవేఱు. గీత దీని ననుసరించి ఆచరించుటను నేర్పుచున్నది. అది యెట్లో తెలిసికొనుటకు మనము ప్రయత్నింతము.

---

'6



# ద్వితీయాధ్యాయము

## సాంఖ్యయోగము

అర్జునుఁడు కొంచెము స్తిమితపడినపుడు భగవానుఁ డతనిని నిందించుచు "నీకీమోహ మెక్కడనుండి దాఁపరించినది? నీవంటి వీరున కిది తగదు" అని నుడివెను. కాని యంతమాత్రముచే నర్జునుని మోహము తొలఁగునది కాదు. అర్జునుఁడు యుద్ధము చేయుటకు తిరస్కరించుచు ఇట్లు చెప్పెను: "స్వజనులను గురుజనులను చంపుటవలన లభించురాజ్యమే కాదు; సర్వభోగములు కూడ నాకు వలదు. నేను చిక్కులోపడి యున్నాను. ఈసమయమున ధర్మమేదియో తెలియుటలేదు. నేను నిన్ను శరణుచొచ్చినాను. ధర్మమును బోధింపుము."

దుఃఖితుఁడు, జిజ్ఞాసువు నగు నర్జునుని జూచి భగవంతునకు దయ కలిగెను. "నీవు కారణము లేకయే దుఃఖితుఁడ వగుచున్నావు. దేహము, దేహమందుండు ఆత్మ వీనిభేదము మఱచినట్లు కనిపించుచున్నావు. దేహము నశించును. ఆత్మ నశింపదు. దేహము పుట్టుటయే గిట్టుటకొఱకు. దేహమునకు యౌవనము, వార్ధకము నేవిధముగా కలుగుచుండునో అట్లే దానికి నాశనముగూడ కలుగుచుండును. దేహమునశించినను దేహమునందుండు ఆత్మ నశింపదు. దేహమునకు జన్మము కలదు. ఆత్మకు జన్మము లేదు. దానికి వృద్ధిక్షయములు లేవు. అది సదా యుండియుండును. నేఁ డున్నది. ముందుకూడ నుండఁగలదు. నీవు దేనికై శోకించుచున్నావు? నీశోకముకూడ వ్యామోహ

జన్యమైనది. ఈ కౌరవాదులను నీవారని తలంచుచున్నావు. అనగా నీయందు మమత్వము జనించినది. కాని యేదేహముకొఱకు నీకు మమత్వముగలదో అది నశించునదియే యని జ్ఞాపకముంచుకొనుము. దానియందుండు ఆత్మనుగుఱించి యాలోచించినచో దానిని నశింపజేయుట కెరికిని సాధ్యము కాదని నీవు తెలిసికొనెదవు. దానిని అగ్ని దహింపలేదు. నీరు ముంపజాలదు. గాలి యెండింపలేదు. నీధర్మమునుగుఱించి విచారించి చూడుము. నీవు క్షత్రియుడవు. నీవెనుకనే సేన కూడి యున్నది. నీవు పిఱికివాడవైనచో విపరీతమగు ఫలము కలుగును. నిన్ను పరిహసింతురు. నీవు శౌర్యవంతుడవుగా పరిగణింపబడుచున్నావు. మధ్యలోనే నీవు యుద్ధమును వదలిపెట్టి పోయినచో భయపడి పాఱిపోయినా వని లోకు లనెదరు. పాఱిపోవుట ధర్మమైనయెడల లోకనిందకు లెక్కచేయ నవసరము లేదు. నీవు పరుగెత్తుట అధర్మము, లోకనిందకు తగినది యగును. రెండుదోషములు తగులును.

నీకు నేను బుద్ధివాదము ననుసరించి చెప్పినాను. ఆత్మదేహముల భేదమును చెప్పితిని. నీకులధర్మములు నీకు జ్ఞాపకము చేసితిని. ఇప్పుడు కర్మయోగము ననుసరించి చెప్పుచున్నాను. ఈకర్మయోగాభ్యాసము చేయువానికి నష్టము కలుగదు. ఇందు తర్కమునకు తావు లేదు. ఇది ఆచరణచేమాత్రము అనుభవవేద్య మయినది. ఇది సుప్రసిద్ధమగు ననుభవము. వేలమణుగుల తర్కముకంటె ఒకతులము ఆచరణ శ్రేష్ఠ మయినది. పరిణామముయొక్క మంచిచెడ్డలతర్క మిమిడియున్న యెడల ఈ యాచరణము దోషపూరిత మగును. పరిణామమునుగూర్చి విచారించినచో బుద్ధి మలిన మగును. శుష్కజ్ఞానముగల పండితులు కర్మకాండమందు నిమగ్నులై అనేకవిధములైన ఫలములను పొందుట కనేకక్రియలు ప్రారంభించెదరు. ఒకదానివలన ఫలము లభింపనిచో

రెండవదానిని ప్రారంభించెదరు. ఎవరైన మూఁడవకర్మమును చూపించిన దానిని జేయుటకు ప్రయత్నించెదరు. ఇట్లు చేయుచో వారిమతి అస్థిరమగును. వాస్తవముగా ఫలమును విచారింపక కర్తవ్యకర్మమును చేయుటయే మనుష్యునిధర్మము. ఇప్పుడు యుద్ధముచేయుట నీకర్తవ్యము. దానిని పూర్తిచేయుటయే నీకర్తవ్యము. లాభనష్టములు, జయాపజయములు నీయధీనమందు లేవు. నీవు కుక్కవలె పర్యవసానమును నిశ్చయించు భారమెందులకు మోసెదవు? జయాపజయములు, శీతోష్ణములు, సుఖదుఃఖములు, దేహమువెనువెంట ననుసరించి యుండియేతీఱును. మనుష్యుఁడు వీనిని సహింపవలయును. పరిణామ మేమయినను నిశ్చింతుఁడై సమత్వము కలిగి తనకర్తవ్యము నందు తన్మయుఁడు కావలయును. దీనిపేరు యోగము. దీనియందే కర్మకౌశలము గలదు. అనఁగా కార్యసిద్ధి దీనిని నెఱవేర్చుటయందే యున్నది, పరిణామమందు లేదు. నీవు స్థిరచిత్తుఁడవు కమ్ము. ఫలమునుగూర్చిన యభిమానము వదలుము. కర్తవ్యపాలనము చేయుము."

ఇది విని అర్జునుఁ డీవిధముగా ప్రశ్నించెను: "ఇది నాశక్తికి మించిన కార్యముగా కనఁబడుచున్నది. జయాపజయములవిచారణ వదలుట, పరిణామమునుగుఱించి విచారింపకయే యుండుట, సమత్వము, స్థిరబుద్ధి యెట్లు కలుగఁగలవు? అట్టి స్థిరబుద్ధి గలవా రెట్లుందురు? వారిని గుర్తించు టెట్లు? నాకు తెలియఁజెప్పుము."

భగవానుఁ డిట్లు బదులు చెప్పెను: "ఎవఁడు తనయెల్ల కోరుకలను వదలునో, అంతఃకరణమందే సంతోషమును పొందుచుండునో, అట్టివానిని స్థిరచిత్తుఁ డని, స్థితప్రజ్ఞుఁ డని, సమాధిస్థుఁడని చెప్పుదురు. అట్టివాఁడు సుఖమువలన ఉప్పొంగఁడు, దుఃఖమువలన క్రుంగిపోఁడు. సుఖదుఃఖాదులు పంచేంద్రియముల విషయములు. కనుక నట్టిచతురుఁడు

తాఁబేలువలె తనయింద్రియములను ముడుచుకొనును. తాఁబేలు శత్రువులను చూచినపుడుమాత్రమే తనఅవయవములను లాగుకొనును. మనుష్యుని యింద్రియములపైని విషయములు ప్రతిదినము దండెత్తుటకు తయారుగా నుండును. కావున మనుష్యుఁడు తనయింద్రియములను వశమునం దుంచుకొని తాఁబేలువలె విషయముల నెదుర్కొనవలెను. ఇదియే నిజమగు యుద్ధము.

కొందఱు విషయములను జయించుటకొఱకు దేహదమనమును, ఉపవాసమును చేయుచుందురు. ఇది మంచిదే. ఉపవాసము చేయుచున్నంతవఱకింద్రియములు విషయములపైపు పరుగిడవు. ఉపవాసమువలననే, రసము-కోరిక-నశింపదు. ఉపవాసము వదలఁగానే కోరిక వృద్ధిగావచ్చును. కోరికను స్వాధీనపఱుచుట కీశ్వరప్రసాదమవసరము. ఇంద్రియములు బలవత్తరములైనవి. మనుష్యుఁడు సావధానముగా నుండనిచో బలవంతముగా లాగుకొనిపోవును. కనుక మనుష్యుఁ డెల్లపుడు నింద్రియములను స్వాధీనమం దుంచుకొనవలయును. ఈశ్వరధ్యానము కలిగినపుడే, అంతర్ముఖుఁ డైనపుడే, హృదయమందుండు అంతర్యామిని గుర్తించినపుడే, భక్తి కలిగినపుడే యిది సాధ్య మగును. ఈవిధముగా నాయందు పరాయణుఁడై యుండి యింద్రియములను తనయధీనమం దుంచుకొనువాఁడు స్థిరబుద్ధి, యోగి యని పిలువఁబడును." అట్లు నడచుకొననివానిగతి యే మగునో యిట్లు చెప్పెను: "ఎవనియింద్రియములు స్వేచ్ఛగా సంచరించుచుండునో, వాఁడు ప్రతిదినము విషయములను ధ్యానించుచుండును. దానిచే విషయములయం దాసక్తి కలుగును. విషయములనే చింతించుచుండును. ఆసక్తివలన వానియందు కామము పుట్టును. అది నెఱవేఱనపుడు క్రోధము జనించును. క్రోధమువే సగము పిచ్చివాఁడుగానగును

వాఁడు తన్ను మఱచిపోవును. స్మృతి తప్పినపు డిష్టము వచ్చినట్లు మాటలాడును, ప్రవర్తించును. అట్టివాఁడు నశింపక మ త్తేమగును? ఈప్రకారముగా నెవనియింద్రియములు దారి తప్పి సంచరించు చుండునో, వానిస్థితి నావికుఁడులేని నావవలె నుండును. వాయువు నావ నిటునటు నీడ్చుకొనిపోవును. చివర కేదోయొక కొండకు కొట్టుకొని చూర్ణమైపోవును. ఎవనియింద్రియములు యథేచ్ఛముగా సంచరించునో వాని కిట్టిస్థితి తటస్థించును. కనుక మనుష్యుఁడు కామములను త్యజింపవలెను. ఇంద్రియములను వశపఱుచుకొన వలయును, అనఁగా అకార్యములను చేయకుండునట్లు చేయవలయును. కన్ను సరిగా నున్నచో పవిత్రవస్తువునే చూచును. చెవి భగవంతునిగుణగానమునే వినును, దుఃఖితుల-ఆర్తనాదమునే ఆలకించును. చేతులు, కాళ్లు సేవాకార్యమందు నిమగ్నము లై యుండును. ఇంద్రియము లన్నియు మనుష్యునికర్తవ్యకార్యమునందే నిమగ్న మై యుండును. దీనివలననే యీశ్వరప్రసాదము లభించును. ఆప్రసాదము లభించినపుడే సర్వదుఃఖములును నశించును. ఇది నిశ్చయ మని తెలిసికొనుము. సూర్యుని యెదుట మంచు కరఁగిపోవునట్లు, ఈశ్వరప్రసాదమను తేజమువలన దుఃఖము లన్నియు మాయ మగును, అదృశ్యములగును. అట్టివాఁడు స్థిరబుద్ధి గలవాఁ డని చెప్పఁబడును. స్థిరబుద్ధి లేనివానికి ఉత్తమభావము లెట్లుండును? సద్భావము లేనివానికి శాంతి యెక్కడిది? శాంతి లేనివానికి సుఖ మెక్కడిది? స్థిరబుద్ధిగల మనుష్యునకు పగటియందువలె స్పష్టముగా కాన్పించునది ప్రపంచపుజంజాటములలో చిక్కుకొనిన అస్థిరునకు కాన్పింపదు. ఏది సంసారులకు (భోగులకు) పవిత్రముగా కాన్పించుచున్నదో అది సమాధిస్థుఁ డగు యోగికి మలినముగా కన్పించును. తత్ఫలితముగా దానివైపు కన్నెత్తి

మాడనైనను చూడఁడు. నదులయందలి, కాలువలయందలినీరు సముద్రమునఁ జేరి శాంతిపడునట్లు-స్థిరపడునట్లు-విషయము లన్నియు సముద్ర రూపమగు యోగియందు శాంతిపొందును. అట్టివాఁడు సముద్రమువలె సదా శాంతముగా నుండును. కనుక సర్వకామములను వదలి, నిస్పృగలవాఁడై, మమత్వమును త్యజించి, తటస్థుఁడుగా నుండుయోగి శాంతిని బొందును. ఇదియే యీశ్వరప్రాప్తి. ఈస్థితిని అంత్యసమయమువఱకును కలిగియుండువాఁడు మోక్షమును పొందును.

---

# తృతీయాధ్యాయము

---

## కర్మయోగము

స్థితప్రజ్ఞుని లక్షణములు విని మనుష్యుఁడు శాంతముగా కూర్చుండవలయు నని అర్జునుఁడు తలఁచెను. స్థితప్రజ్ఞుని లక్షణము వర్ణనయందు కర్మముయొక్క పేరుగూడ వినఁబడలేదు. కనుక అర్జునుఁడిట్లడిగెను: "మీయుపదేశమునుబట్టి కర్మముకంటె జ్ఞాన మధిక మని తెలియుచున్నది. ఈకారణమున నాబుద్ధి వ్యాకులపడుచున్నది. జ్ఞానమే శ్రేష్ఠ మైనయెడల నన్ను ఘోరకర్మమం దెందులకు ప్రవేశ పెట్టుచున్నావు? దేనియందు నాకు శ్రేయము గలదో దానిని నాకు స్పష్టముగా చెప్పవేఁడెదను."

భగవానుఁ డీవిధముగా చెప్పెను: "అర్జునా! పూర్వమున నుండియు నీప్రపంచమందు రెండుమార్గము లాచరణమం దున్నవి. మొదటిది జ్ఞానప్రధాన మైనది. రెండవది కర్మప్రధాన మైనది. కర్మము లేనిదే మనుష్యుఁ డకర్మి కాఁజాలఁడు. కర్మము లేనిదే జ్ఞానము లభింపదు. సర్వమును త్యజించి స్వస్థతగా కూర్చుండు మనుష్యుఁడు సిద్ధపురుషుఁడు కాఁజాలఁడు. ప్రతిమనుజుఁడు నేదియో యొకకర్మమును చేయుచుండుట నీవు చూచుచునేయున్నావు. అతని స్వభావమే యేదోయొకకర్మమును వానిచే చేయించుచుండును. జగన్నియమ మీవిధముగా నుండఁగా నేమనుష్యుఁడు కాలినీఁదను కాలుఁ నైచికొని కూర్చుండి మనసునం దనేకసంకల్పవికల్పములను జేయు

చుంచునో వాఁడు మూర్ఖుఁడు, మిథ్యాచారి యని చెప్పఁబడును. ఇంద్రియములను వశపఱుచుకొని రాగద్వేషములను వదలి ఆత్మవంచన లేక ఆసక్తిరహితుఁడై కర్మము నాచరించుట మేలు కాదా? నియతకర్మమును—నీవంతునకు వచ్చిన సేవాకార్యమును—ఇంద్రియములను వశపఱుచుకొని చేయుచుండుము. సోమరివలె కూర్చుండుటకంటె సేవాధర్మము శ్రేష్ఠమైనది. సోమరియై కూర్చుండువానిశరీరము తుదకు క్షీణించును. కర్మము చేయునపుడు యజ్ఞకార్యము తప్ప మిగిలినకార్యములన్నియు బంధకము లని జ్ఞాపక ముంచుకొనుము. యజ్ఞ మనఁగా స్వార్థమునకై కాక పరోపకారము చేయునట్టికర్మము. కేవలము సేవార్థము చేయునట్టిసేవయం దాసక్తి, రాగద్వేషములు నుండనేరవు. ఇట్టియజ్ఞమును, సేవయును చేయుచుండుము. బ్రహ్మ యీజగత్తును సృజించి, దానితోపాటు యజ్ఞమునుకూడ సృజించి మనచెవిలో నీ మంత్రము నుపదేశించెను. పృథ్విని చేరుఁడు. పరస్పరముసాహాయ్యము చేసికొనుఁడు. అభివృద్ధిని పొందుఁడు. సర్వజీవులును దేవతారూపములని తెలిసికొనుఁడు. సేవచేసి యీదేవతలనుప్రసన్నులుగా చేయుఁడు. వారు మిమ్ము ప్రసన్నులనుగాచేయుదురు. ప్రసన్నులైనదేవతలుమీకోరికలను, వారిని కోరకముందే తీర్చెదరు. లోకసేవ చేయకయే, భూతములకు వారిభాగమును వారి కర్పింపకయే భుజించువాఁడు దొంగ. సర్వభూతములకును వారివారిభాగము నర్పించుచు నెవఁడు తినునో, అనుభవించునో-వాని కనుభవించుట కర్హత కలదు. అనఁగా పాపమునుండి ముక్తుఁడగును. దీనికి వ్యతిరేకముగా నెవరు తమ లాభముకొఱకే సంపాదించుకొందురో వారు పాపులు, పాపభూయిష్ఠమైనయన్నము భుజించినవా రగుదురు. అన్నమువలన సర్వజీవులును జీవించుచున్నవి. అన్నము వర్షమువలనను, వర్షము యజ్ఞమువలనను కలుగుచున్నవి.

ఇది సృష్టినియమము. అనఁగా సర్వభూతముల కర్మములవలన-శ్రమవల న-అన్న ముత్పత్తి యగుచున్నది. జీవులు లేనిచోట వర్షము లేదు. జీవు లున్నచోట వర్ష ముండియేయున్నది. సర్వజీవులును (శ్రమ) కర్మములను చేయునవియే. పరిశ్రమ చేసి జీవించునవి. ఎల్లప్పుడును విశ్రాంతి తీసికొనువాఁడు దేనిని అనుభవింపఁజాలఁడు. ఈనియమము సర్వజీవులకును వర్తించునపుడు మనుష్యునివిషయమున దీని ప్రాముఖ్య మునుగూర్చి చెప్ప నేల ? కనుకనే కర్మమును బ్రహ్మ సృజించె ననియు, బ్రహ్మ అక్షరబ్రహ్మముననుండి యుద్భవించె ననియు భగవానుఁడు చెప్పెను. ప్రతియజ్ఞమునందును, ప్రతిసేవయందును అక్షరబ్రహ్మము పరమేశ్వరుఁడు విరాజిల్లుచున్నాఁ డని తెలిసికొనవలయును. ఈకాల చక్రము నెవఁడనుసరింపఁడో వాఁడు పాపి. వానిజీవితము వ్యర్థము. ఎవనికి ఆత్మశాంతి గలదో అట్టివానికి చేయవలసిన కార్య మేదియు లేదు. ఏకార్యమునైనను చేయుటయందుఁ గాని, చేయకపోవుటయం దుఁ గాని ఎట్టిలాభమును లేదు. అతనికి దేనియందును స్వార్థ ముం డదు. కాని యతఁడు యజ్ఞకార్యమును వదలఁజాలఁడు. నీవు నిత్యము కర్తవ్యకర్మమును చేయుచుండుము. దానియం దాసక్తి కలిగియుండ కుము. ఎవఁ డనాసక్తిపూర్వకముగా కర్మమును చేయునో అతఁడే యీశ్వరసాక్షాత్కారమును పొందును. జనకాదులు నిర్లిప్తులై రాజ్య కార్యములను చేయుచు సిద్ధిని పొందిరి. వారు లోకహితముకొఱకే కార్యములను చేయుచుండిరి. దీనికి విపరీతముగా నీ వెట్లు చరింపఁ గలవు ? యోగ్యు లనియు, మాన్యు లనియు తలంపఁబడువా రేవిధ ముగా నడచుకొందురో ఆవిధముగానే జనసామాన్యము నడచుకొనును. నియమ మీరీతిగా నున్నది. నన్ను చూడుము. కర్మమునుచేసి నేనెట్టి స్వార్థమును పొందవలసి యున్నది ? నేను ౨౪గంటలును విశ్రాంతి లేక

కార్యమందే నిమగ్నుఁడ నైయున్నాను. నన్నుచూచి లోకముకూడ కొలఁదిగనో గొప్పగనో నన్ను అనుసరించుచున్నది. నేను సోమరినై యున్నచో ప్రపంచస్థితి యేమగును? సూర్యచంద్ర నక్షత్రాదుల గమనము స్తంభించిపోవును. నేనేకదా వీని నన్నిటిని నియమమం దుంచువాఁడను, నడపువాఁడను. నేననాసక్తుఁడను. లోకులాసక్తులై, స్వార్థపరులై కర్మమును జేయుదురు. లోకులకును నాకు నిదియే భేదము. నీవంటిజ్ఞానులు కర్మమును వదలినయెడల లోకులు నట్లే చేయుదురు; బుద్ధిభ్రష్టు లగుదురు. నీ వాసక్తిని వదలి కర్మమును చేయవలయును. దీనివలన లోకులు కర్మభ్రష్టులు కాకుండుటయు, క్రమముగా అనాసక్తు లగుటయు సంభవించును.

మనుష్యస్వభావమునం దున్నగుణములకు వశులై వారు కర్మములను చేయుచునేయుందురు. మూర్ఖుఁడు తాను చేయుచున్నా నని తలంచును. శ్వాసోచ్ఛ్వాసములు సర్వజీవులకును స్వభావములు. కంటి మీఁద నేదైనను పడిన రెప్ప స్వభావముగనే వాలును. అప్పుడు నేను శ్వాసము పీల్చుచున్నాను, రెప్ప వాల్చుచున్నాను అని యెవఁడును చెప్పఁడు. ఈవిధముగానే చేయుకర్మము లన్నియు స్వభావసిద్ధ మైనవిగాను, గుణానుసార మైనవిగాను ఎందుల కుండఁగూడదు? వానిని చేయుటయం దహంకార మేల? సర్వకర్మములను నా కర్పించి నానిమిత్తము మమకారము వదలి కర్మములు చేయవలయును. ఇదియే సర్వకర్మములను స్వభావసిద్ధముగా చేయుమార్గము. ఇట్లు చేసిన మనుష్యునియం దహంకారము, స్వార్థభావము నశించి కర్మములు స్వాభావికములు, నిర్దోషములు నగును. అట్టివాఁడు పెక్కుచిక్కులనుండి విముక్తుఁ డగును. అతనికి కర్మబంధ మనునది యేదియు నుండదు. స్వభావానుసారముగా పని జరగుచో బలవంత పెట్టుట యనుభావ ముండఁ

జాలదు. ఉన్నయెడల నది యహంకారమే యగును. బలవంతమువలన బాహ్యకర్మము లాఁగిపోయినప్పటికిని అతని మనస్సు సంకల్పములతో నిండియుండును. ఇది బాహ్యకర్మనియమముఁకంటె చెడ్డదియును, అధికబంధనము కలుగఁజేయునదియు నైయున్నది.

ఇంద్రియములకు వాని వాని విషయములయందు రాగద్వేషము లుండుట వాస్తవము. శ్రోత్రేంద్రియమున కొకదానియందు ప్రీతియు, మఱియొకదానియం దనిష్టమును ఉండును. ఘ్రాణేంద్రియము, గులాబీపువ్వు సుగంధమునందు ప్రీతియు, మలాదిదుర్గంధములం దనిష్టమును కలిగియుండును. ఇట్లే అన్నియింద్రియములవిషయమునను ఉన్నది. మనుష్యులు చేయవలసిన దేమన రాగద్వేషము లనుదొంగలను వశపఱుచుకొనవలయును. వానిని బయటికి పాఱఁద్రోలవలయును. కర్తవ్యకర్మ మేది యని వెదకుచు తిరుగఁగూడదు. నేఁడీకార్యమును, రేపు మఱొకటి, యెల్లుండి యింకొకటి అని యీవిధముగా వ్యర్థముగా కార్యభారమును నెత్తిపైకి వేసికోఁ దగదు. తనవంతునకు వచ్చిన కార్యము, నీశ్వరప్రీత్యర్థము చేయుటయందు తత్పరుఁడు కావలయును. ఈవిధముగా చేయుచుండిన, చేయునదంతయు నీశ్వరుఁడే చేయుచున్నాఁ డను భావము కలుగును. ఈ జ్ఞానము కలుగుచో అహంభావము నశించును. ఇదియే స్వధర్మము. స్వధర్మమందు నిశ్చలముగా నుండవలయును. మన కదియే ఉత్తమమైనది. పరుల ధర్మ మెక్కువశ్రేష్ఠమైనదిగా కనిపించును. అయినను అది భయంకర మైన దని తెలిసికొనుము. స్వధర్మాచరణము చేయుచు మృత్యువును పొందుటయందే మోక్షము కలదు. రాగద్వేషరహితుఁడవై కర్మము చేయవలయును. ఇదియే యజ్ఞము."

భగవంతుఁ డిట్లు చెప్పఁగా అర్జునుఁ డీవిధముగా ప్రశ్నించెను: "మనుష్యుఁడు దేనిప్రేరణచే పాపకార్యములను చేయుచున్నాఁడు? ఎవరో బలాత్కారముగా వానిని పాపకర్మమునైపున కీడ్చుచున్నట్లు సాధారణముగా తెలియుచున్నది."

భగవంతుఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను: "మనుష్యుని పాపకార్యమునైపున కీడ్చుకొనిపోవునవి కామము, క్రోధము. వీరిద్దఱు నన్నదమ్ములు. కామము నెఱవేఱనప్పుడు క్రోధము వచ్చును. కామక్రోధములు కలవానిని రజోగుణముకలవాఁ డని చెప్పుదుము. మనుష్యుని శత్రువు లివియే. వీనితో మానవుఁడు ప్రతిదినము యుద్ధము చేయవలసియున్నది. అద్దము దుమ్ముచేతను, నిప్పు పొగచేతను, గర్భము మావిచేతను కప్పఁబడియున్నట్లు జ్ఞానియొక్క జ్ఞానము కామక్రోధములచే కప్పఁబడి ప్రకాశింపదు. కామ మగ్నివలె భయంకర మైనది. అది యింద్రియములను, మనస్సును, బుద్ధిని తనవశమం దుంచుకొని మనుష్యుని నాశనము చేయును. కావున ప్రప్రథమమున్న నీ వింద్రియములను వశపఱుచుకొనుము. పిమ్మట మనస్సును జయింపుము. ఇట్లు చేసిన బుద్ధికూడ నీవశ మగును. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి యొకదానికంటె మఱొకటి మించిన నైనను వీనియన్నింటికంటెను ఆత్మ చాల శ్రేష్ఠమైనది. మనుష్యునకు తనశక్తి—తనఆత్మ—యొక్క ప్రభావము తెలియదు. ఆత్మశక్తి తెలియకయే యింద్రియములు మనస్సు వశమందుండ వనియు, బుద్ధి పనిచేయ దనియు తలఁచుచున్నాఁడు. ఆత్మశక్తియందు విశ్వాసము కలుగఁగనే మిగిలిన వన్నియు సులభములగును. ఎవఁ డింద్రియములను, మనస్సును, బుద్ధిని వశమం దుంచుకొనునో వానిని కామక్రోధములు, వాని యసంఖ్యాసైన్యము నేమియుఁ జేయఁజాలవు."

ఈయధ్యాయము గీతను తెలిసికొనుటకు కీలక మని చెప్పి యుంటిమి. దీనిసారము "జీవితము సేవకొఱకు, భోగముకొఱకు కాదు." అని ఒకవాక్యముచేత తెలిసికొననగును. కనుక జీవిత మును యజ్ఞమయముగా చేసికొనవలయును. ఇది తెలిసికొన్నంత నే పని పూర్తి కాఁజాలదు. దీనిని తెలిసికొని యాచరించుచుండినచో ఉత్తరోత్తరము పరిశుద్ధుల మగుదుము. నిజ మైన సేవ యేదియో తెలిసికొనుట కింద్రియనిగ్రహ మావశ్యకము. ఇట్లు చేయుచుండి నచో ముందుముందు మనము సత్యరూపమగు పరమాత్మసాన్నిధ్య మందు చేరుదుము. క్రమక్రమముగా మనకు సత్యసాక్షాత్కారము పూర్ణముగా కలుగును. సేవాకార్యముకూడ స్వార్థదృష్టితో చేసిన యెడల అది యజ్ఞము కాఁజాలదు. కనుక అనాసక్తి పరమావశ్య కము. ఇది లభించినపిమ్మట మన కితరవాదవివాదములందు ప్రవే శింప నవసర ముండదు. అర్జునునకు నిజముగా స్వజనులను చంప వలయు నని యుపదేశించెనా? అది ధర్మమా? అను ప్రశ్నలు కలుగఁజాలవు. అనాసక్తి లభించినపిమ్మట మనచేతిలో నెవరినైనను చంపుటకు కత్తి యున్నను సహజముగానే యది చేతనుండి జాఱి క్రిందఁబడును. అనాసక్తి ఆడంబరముచే లభించునది కాదు. ప్రయ త్నించిన నేఁడే లభింపవచ్చును. లేదా వేయిసంవత్సరములు ప్రయ త్నించినప్పటికిని లభింపకపోవచ్చును. దీనివిషయమున చింతనుకూడ మనము విడువవలయును. ప్రయత్నమందే ఫలిత మున్నది. మనము ప్రయత్నము సరిగా చేయుచున్నామా లేదా యనువిషయమందు పూర్ణముగా ధ్యాన ముంచవలయును. ఇందు ఆత్మవంచకుఁడు కాఁ గూడదు. దీనిని స్మరించుచో నిది అంవఅకును సాధ్య మగును.

---

౭౧

# చతుర్థాధ్యాయము

---

## జ్ఞానకర్మయోగము

భగవంతుఁ డిటులు చెప్పెను: "నేను నిష్కామకర్మయోగము ను తెలిపినాను. ఇది ప్రాచీనకాలముననుండి యాచరణమందున్నదే. ఇది క్రొత్తవిషయము కాదు. నీవు ప్రియభక్తుఁడవు గనుకను, ధర్మసంకటమందు పడియున్నావు గనుకను, నీవు ముక్తుఁడ వగుట కుపదేశించితిని. ఎప్పుడెప్పుడు ధర్మము క్షీణించి అధర్మము ప్రబలునో, అప్పుడు నే నవతరించుచుందును. భక్తులను రక్షించి, పాపులను సంహరించుచుందును. ఎవరు నాయీమాయను తెలిసికొందురో, ఎవ రధర్మము తప్పక నశించు ననియు, సాధుపురుషులను రక్షించువాఁ డీశ్వరుఁడే యనియు నమ్మెదురో వారు ధర్మమును త్యజింపరు; అంతమందు నన్నును పొందుదురు. అట్టివారు నన్ను ధ్యానించువారు గనుకను, న న్నాశ్రయించువారు గనుకను, వారు కామక్రోధాదులనుండి విముక్తులగుదురు. తపము, జ్ఞానమువలన పవిత్రులగుదురు. మనుష్యుఁడు తన కర్మమునుబట్టియే ఫలితమును పొందును.

నాశాసనము నతిక్రమించి యెవ్వఁడు నుండఁజాలఁడు. గుణకర్మభేదమునుబట్టియే నేను నాలుగువర్ణములను సృజించితిని. అయినప్పటికిని వానికి కర్త నని తలంపకుము. ఏల యన నా కాకార్యమువలన నేవిధమగు ఫలాపేక్షయు లేదు. దానిపాపపుణ్యములు నా కంటవు. ఈశ్వరునియొక్క యీమాయను తెలిసికొనవలసినది. జగత్తునందలి కర్మము

లన్నియు నీశ్వరనియమముల ననుసరించియే జరగుచుండును. అయినను వానివలననుండి ఈశ్వరుఁడు నిర్లిప్తుఁడుగా నుండును గాన, కర్తయు, అకర్తయుఁ గూడ నైయున్నాఁడు. ఇట్లు నిర్లిప్తుఁడుగా నుండి అంటకుండ, ఫలేచ్ఛ లేకుండ, ఈశ్వరుఁ డెట్లు ప్రవర్తించుచున్నాఁడో అట్లే మనుష్యుఁడును ప్రవర్తించుచుండినచో తప్పక మోక్షమును పొందును. అట్టివాఁడు కర్మమం దకర్మమును జూచును. వానికి కర్మఫలము కూలి (మజూరీ) రూపముగా లభింపకపోయినను క్రియా రూపముననే లభించును. ఫలిత మనంత మయినది. కాని క్రియయందు తాదాత్మ్యము నొందవలయును. (కర్మమందు లీన మైపోవలయును.) ఇట్లు చేయుటలో యాజ్ఞికునియందు పవిత్రత మొదలగునవిగూడ నుండవలయును. అట్టిస్థితిలో యాజ్ఞికుని కెట్టికోరికయు నుండఁ గూడదు.

## నిష్కామకర్మము

అట్టివానికి నిషిద్ధకర్మ మేదియో తెలియుచుండును. ఏకర్మములయందు కామ ముండునో, ఏవి కామము లేకుండ జరగనేరవో, అట్టికర్మము లన్నియు నిషిద్ధకర్మము లని చెప్పఁబడును. దొంగతనము, వ్యభిచారము మొదలైనవి యిట్టికర్మములే. ఇట్టికర్మములను నిర్లిప్తుఁడై యెవ్వఁడును చేయఁజాలఁడు. కనుక నెవఁడు కోరికను, సంకల్పమును వదలి కర్తవ్యకర్మమును చేయుచుండునో, అట్టివానికర్మములు జ్ఞానాగ్నివలన దగ్ధములైన వని చెప్పవచ్చును. ఈవిధముగా కర్మఫలాసక్తిని వదలువాఁడు నిత్యసంతుష్టుఁడుగా నుండును, స్వతంత్రుఁడగును. అతనిమనస్సు స్థిరముగా నుండును. అతఁ డేవిధ మైనసంపాదనయందును చిక్కుకొనఁడు. ఆరోగ్యవంతుని శరీరధర్మములు సహజము

గానే జనగుచుండును. నేనే స్వయముగా చేయుచున్నా నను నభి మాన మాతని కుండదు. అతఁడు నిమిత్తమాత్రుఁడుగా నుండును. సఫలమైన ఉప్పొంగఁడు, నిష్ఫల మైనపుడు నిరాశం జెందఁడు. అతని సర్వకర్మములును యజ్ఞ రూపములు, సేవార్థములు. సర్వవ్యాపారము లందును ఈశ్వరునే చూచును. అంతమం దీశ్వరునే పొందును.

పలువిధము లగు యజ్ఞములు చెప్పఁబడినవి. పవిత్రతయు, సేవయు సమస్తయజ్ఞములకును మూలములు. ఇంద్రియదమన మొక విధ మగుయజ్ఞము, దానముచేయుట మఱొకయజ్ఞము, ప్రాణాయామాదులు శుద్ధికొఱకు చేయఁబడుయజ్ఞములు. వీనిని జ్ఞానముగలగురువు వలననే తెలిసికొననగును. తెలిసికొనకయే జ్ఞానపూర్వకము లని అనేకక్రియలను ప్రారంభించినయెడల నవి యజ్ఞానజన్యము లగుటచే శ్రేయమునకు బదులు కీడును కలుగఁజేయును.కనుక ప్రతికార్యమును జ్ఞానపూర్వకముగా చేయు టత్యావశ్యకము.

ఈజ్ఞాన మక్షరజ్ఞానము కాదు. దీనియందు శంకకు స్థానము లేదు. శ్రద్ధలోనే యిది ప్రారంభించును. చివర కనుభవము కలుగును. ఇట్టిజ్ఞానముచే మనుష్యుఁడు సర్వభూతములను తనయందుఁ జూచును. తన్నీశ్వరునియందుఁ జూచును. సర్వము ఈశ్వరమయ మని ప్రత్యక్షముగఁ దోఁచును. జ్ఞానము, పాపులలో మహాపాపినైనను ఉద్ధరించును. ఈజ్ఞానము మనుష్యుని కర్మబంధమునుండి విడిపించును. అనఁగా కర్మఫలము లతని కంటవు. ఈజగత్తున జ్ఞానముకంటె పవిత్ర మైన దేదియును లేదు. కనుక నీవు శ్రద్ధతో ఈశ్వరపరాయణుఁడవై ఇంద్రియములను వశమం దుంచుకొని, ఈజ్ఞానమును పొందుటకు ప్రయత్నింపుము. దీనివలన నీకు పరమశాంతి కలుగును.

## ౪. జ్ఞాన కర్మయోగము

ఈయధ్యాయమును, మూఁడవ, ఐదవయధ్యాయములును చేర్చి ఒకటేపర్యాయము మననము చేయఁదగినవి. వీనివలన అనాసక్తియోగమన నేమియో తెలియును.

అనాసక్తి—నిష్కామము—ఎట్లు లభించునో యను విషయమిందు చెప్పఁబడినది. ఈ (౩, ౪, ౫) మూఁడధ్యాయములను పూర్తిగా గ్రహించిన మిగిలిన అధ్యాయములను గ్రహించుట సుకరము. ముందుగల అధ్యాయములం దనాసక్తిని పొందుట కనేకసాధనములు చెప్పఁబడినవి. మన మీదృష్టితో గీతాధ్యయనము చేయుట అవసరము. ఇట్లు చేయుచున్నచో మనకు నిత్యజీవనమునందుఁ గలుగు చిక్కులను గీతవలన మనము సుకరముగా విడఁదీసికొనఁగలము. ప్రతిదినమును అభ్యాసము చేసినయెడల నిది కలుగఁగలదు. అందఱును పరీక్షించి చూచెదరుగాక. కోపము వచ్చినచో దానికి సంబంధించిన శ్లోకములను జ్ఞాపకము చేసికొని అణఁచివేయుము. ఎవనియం దైనను ద్వేషము కలిగినను, అధైర్యము కలిగినను, తిండిపోతుతనము పెరిఁగిపోవుచున్నను ఏది చేయవలయును? ఏది చేయరాదు? అను ధర్మసంకటము కలిగినను శ్రద్ధకలిగి నిత్యము మననము చేయుచున్నచో గీతామాత ఈ సందేహములన్నియు తీర్చుటకు దగ్గరనే లభించును. మనము దీని కలవాటు పడవలయును. అట్టి యలవాటు కలుగుటకే గీతాపారాయణమును, ప్రయత్నమును చేయవలయును.

## పంచమాధ్యాయము

---

## కర్మ సన్న్యాస యోగము

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను:—

మీరు జ్ఞానము శ్రేష్ఠ మని చెప్పుచున్నారు. దీనివలన నేను కర్మము చేయ నవసరము లే దనియును, సన్న్యాసమే శ్రేష్ఠ మని యును గ్రహించుచున్నాను. కాని మీరు దానితోపాటు కర్మమును గూడ స్తుతించుచున్నారు. దీనివలన (కర్మ)యోగము శ్రేష్ఠ మని తోఁచుచున్నది. కనుక నీరెండింటిలో నేది శ్రేష్ఠతర మైనదో నాకు నిశ్చయముగా చెప్పిన శాంతి కలుగును.

ఇది విని శ్రీభగవానుఁ డిట్లు చెప్పెను:—

సన్న్యాస మనఁగా జ్ఞానము. కర్మ మనఁగా నిష్కామ కర్మము. ఈరెండును మంచివే. ఈరెంటిలో మేలైనదానిని చెప్ప వలయు నన్నచో యోగము, అనఁగా అనాసక్తికర్మయోగ మెక్కువ శ్రేష్ఠ మైనది. ఎవఁ డెవరిని ద్వేషింపఁడో, ఏవిధమైన కోరికలుఁ కలిగి యుండఁడో, సుఖదుఃఖములు, శీతోష్ణములు మొదలగుద్వంద్వముల నుండి విముక్తుఁ డైయుండునో వాఁడు సన్న్యాసియే. కర్మము చేసి నను సరియే, చేయకున్నను సరియే, అట్టివాఁడు సహజముగనే బంధ ముక్తుఁ డగును. అజ్ఞాని జ్ఞానమును, యోగమును వేఱువే అని తలం చును. జ్ఞాని అట్లు తలంపఁడు. రెండింటివలన ఒకటే పరిణామము కలుగును. రెండింటివలనను ఒకటే స్థానము లభించును. కాఁబట్టి

ఎవఁడు రెండింటిని ఒకటేస్వరూపముగల వని తెలిసికొనునో వాఁడే సత్యమును తెలిసికొనువాఁడు. ఏలయన నెవనికి శుద్ధజ్ఞానము కలుగునో వాఁడు సంకల్పమాత్రముచేతనే కార్యసిద్ధిని పొందును. వానికి బాహ్య కర్మములు చేయ నవసర ముండదు. జనకపురి తగులఁబడుచుండినపుడు దాని నార్పుట యితరులధర్మ మైయుండెను. జనకునిసంకల్పమే నిప్పు నార్పుటయందు సాయపడెను. ఏల యన నీకార్యమందు వాని సంకల్పబలమువలననే సేవకు లందఱును వానికి తోడైరి. అతఁడే నీటి కుండను నెత్తిని పెట్టుకొని పరుగిడుచుండినచో ప్రమాదము కలిగెడిది. ఇతరులు వానిముఖమును చూచుచు తమకర్తవ్యమును మఱచి యుండెడివారు. వారిలో నుత్తము లాతురతతో జనకుని రక్షించుటకు పరుగిడియుందురు. కాని అందఱు నంత సులభముగా జనకులు గాఁజాలరు. జనకునిస్థితి నొందుట చాల దుర్ఘటము. ఆపదవి కోట్లకొలఁది జనులలో నొకని కనేకజన్మములపర్యంతము సేవ చేయుటవలన లభింపవచ్చును. ఈపదవిని పొందినపిమ్మట విశేష శాంతి కలుగు ననికూడ చెప్ప వీలు లేదు. నిష్కామ కర్మమును చేయుటచే ఉత్తరోత్తరము మనుష్యునియొక్క సంకల్పబలము వృద్ధి యగును. బాహ్యకర్మములు తగ్గును. వాస్తవమునకు వాని కీవిషయమున తెలియదు. దీనికై ప్రయత్నముగూడ చేయఁడు. వాఁడు సేవాకార్యమందే నిమగ్నుఁడైయుండును. ఈవిధముగా చేసినవానికి సేవాశక్తి వృద్ధియగును. సేవ చేయుటయందు వాని కలసట కనుపడదు. చివర కాతనిసంకల్పమందే సేవ యిమిడియుండును. అతివేగముగా తిరుగువస్తువవలె నతఁడు స్థిరుఁడుగా నున్నట్లు కాన్పించును. అట్టివాని విషయమున వాఁ డేమియు చేయుటలేదని చెప్పుట అనుచితము. సాధారణముగా అట్టిస్థితిని ఊహింపవలసినదే కాని అనుభవవేద్య

మయినది గాదు. ఇందుకనియే నేను కర్మయోగము శ్రేష్ఠ మని చెప్పితిని. కోట్లకొలఁదిమంది నిష్కామకర్మమువలననే సన్న్యాసము యొక్క ఫలమును పొందుచున్నారు. సన్న్యాసులు కావలయు నన్న రెంటికిని చెడుదురు. సన్న్యాసి కావలయు నన్న ప్రయత్నములో మిథ్యాచారి యగుట కవకాశ మున్నది. కర్మభ్రష్టుఁ డగును. దీనివలన సర్వనాశన మొందును. ఎవఁడా అనాసక్తిపూర్వకముగా కర్మము చేయుచు పరిశుద్ధుఁ డగునో, ఎవఁడు తనమనస్సును జయించునో, ఎవఁ డింద్రియములను తనవశమం దుంచుకొనునో, ఎవఁడు సర్వభూతములతోను తానైక్యమగునో వాఁ డందఱను తనవలెనే చూచును. కర్మము చేయుచుండియు నిర్లిప్తుఁడుగా నుండును. బంధనమున చిక్కుకొనఁడు. అట్టివాఁడు మాటాడుట, నడచుట మొదలగు క్రియలను చేయుచుండియు, ఇంద్రియములు స్వస్వధర్మానుసారముగా పనులను చేయుచున్నట్లు గ్రహించును. వాఁ డేమియు స్వయముగా చేయఁడు. శరీరారోగ్యము గల వాని పనులు స్వాభావికములుగా నుండును. వాని జఠరాద్యంగములు తమంతటఁ దామే పనులను చేయుచుండును. వానికి వానివైపు ధ్యానముంచుట కవసరము కలుగదు. ఈవిధముగానే యెవరి ఆత్మ ఆరోగ్యమైనదో అది శరీరమం దుండియు నిర్లిప్తముగా నుండును. అ దేమియును చేయుటలే దని చెప్పవచ్చును. కనుక సర్వకర్మములను మనుష్యుఁడు బ్రహ్మార్పణము చేయవలయును. బ్రహ్మముకొఱకు చేయవలయును. దీనివలన కర్మము చేయుచుండినను పాపపుణ్యము లంటవు. నీటిలో తామరాకువలె నిర్లిప్తుఁడుగా నుండును.

అనఁగా నెవఁ డనాసక్తిని నేర్చినాఁడో ఆయోగి మనోబుద్ధికాయములచే కర్మములఁ జేయుచుండియు సంగరహితుఁడై అహంభావమును వదలి ప్రవర్తించుచుండును. మఱియు పరిశుద్ధుఁ డగును.

## ౫. కర్మసన్న్యాసయోగము

శాంతిని పొందును. యోగి కానివాఁడు పరిణామమం దాసక్తుఁడై యుండుటచే ఖైదీవలె తనకామములచే బంధితుఁ డగును. యోగి నవద్వారములు గల దేహనగరమునందు సర్వకర్మములను మనస్సుతో త్యజించి తాను స్వయముగ చేయకయు, చేయింపకయు సుఖముగా నుండును. సంస్కారముగల పరిశుద్ధాత్మ పాపము చేయదు, పుణ్యము చేయదు. ఎవఁడు కర్మమునుండి ఆసక్తిని తొలఁగించినాఁడో, అహంభావమును నాశనము చేసినాఁడో, ఫలత్యాగమును చేసినాఁడో, వాఁడు జడునివలె ప్రవర్తించును. నిమిత్తమాత్రుఁడుగా నుండును. అట్టివానికి పాపపుణ్యములస్పర్శ యెట్లు తగులును? దీనికి వ్యతిరేకముగా, అజ్ఞానమునందు చిక్కుకొనినవాఁడు నే నింత పుణ్యపాపమును చేసినా నని లెక్కించుకొనును. అట్లు చేయుచు పతితుఁ డగుచున్నాఁడు. చివర కతనివంతునకు పాపమే మిగులును. ప్రతిదినము జ్ఞానముద్వారా తనయజ్ఞానమును నాశనము చేసికొనుచుండువాని కార్యమందు నిర్మలత్వము దినదినాభివృద్ధి యగుచుండును. అతని కర్మములయందు జగత్తు పూర్ణత్వమును, పవిత్రతను చూచుచుండును. అట్టివానికర్మము లన్నియును స్వాభావికములుగా నుండును. వాఁడు సమదర్శి యగును. వానిదృష్టియందు, విద్యావినయసంపన్నుఁడును, బ్రహ్మ మెఱిఁగిన బ్రాహ్మణుండును, ఆవు, ఏనుఁగు, కుక్క, వివేకహీనుఁడు, పశువుకంటె నికృష్టులు-వీ రందఱును సమానులే. అనఁగా వీ రందఱకును సమానభావముతో సేవ చేయును. ఒకనిని శ్రేష్ఠుఁడని తలఁచి గౌరవమును, రెండవవానిని నీచుఁ డని అగౌరవమును చేయఁడు. అనాసక్తిగలవాఁడు త న్నందఱకిని ఋణగ్రస్తుఁడని తెలిసికొనును. అందఱ ఋణమును తీర్చును. పూర్ణముగా న్యాయము చేయును. అట్టివాఁ డిక్కడనే జగత్తును జయించినవాఁ డగును.

బ్రహ్మమయుఁ డగును. పొగడినందున సంతోషమును, నిందించినందున దుఃఖమును జెందఁడు. ఆసక్తిగలవాఁడు సుఖముకొఱకై బయట వెదకును. అనాసక్తిగలవానికి లోపలనుండియే నిరంతరము శాంతి కలుగును. అట్టివాఁడు బాహ్యప్రపంచముననుండి జీవుని మరలించినవాఁ డగును. ఇంద్రియజన్యములగు భోగములు దుఃఖకారణములు. మనుష్యుఁడు కామక్రోధాదులవలన కలుగు నుపద్రవములను సహించుటుచితము. అనాసక్తిగల యోగులు సమస్తప్రాణుల హితమునందే నిమగ్నులై యుందురు. వారు శంకలవలన పీడితులు గారు. అట్టి యోగులు బాహ్యజగత్తుననుండి వేఱుగా నుందురు. ప్రాణాయామాదుల ప్రయోగములచే నంతర్ముఖు లగుటకు తీవ్రప్రయత్నము చేయుచుందురు. ఇచ్ఛా, భయ, క్రోధాదులకు దూరముగా నుందురు. వారు నన్నే సర్వేశ్వరుఁడ ననియు, మిత్రుఁడ ననియు, యజ్ఞములందు భోక్త ననియు తెలిసికొని శాంతిని పొందుదురు.

---

## ౬

# షష్ఠాధ్యాయము

---

## ధ్యా న యో గ ము

భగవానుఁ డిట్లు చెప్పెను :—

కర్మఫలమును వదలి కర్తవ్యకర్మమును చేయువాఁడు సన్న్యాసి యనియు, యోగి యనియుఁగూడ చెప్పఁబడును. కర్మములుమాత్రము వదలువాఁడు సోమరి. ఇందలిసత్యమే మన, మనస్సనుగుఱ్ఱమును పరుగెత్తనీయకుండఁజేయుటయే. యోగమును - అనఁగా సమత్వమును- సాధింపఁగోరువానికి కర్మము లేనిది వానిపని జరగనే జరగదు. సమత్వమును పొందినవాఁడు శాంతుఁడుగా కనిపించును. అనఁగా నాతనిసంకల్పమాత్రముచేతనే కర్మబలము చేకూరుచున్నది. మనుష్యుఁ డింద్రియముల యొక్క విషయములయందుఁగాని కర్మములయందుఁగాని యాసక్తుఁడు గానప్పుడు, మనస్సునందున్న రాగములన్నిటినివదలినపుడు యోగమును సాధించినవాఁడనియు, యోగారూఢుఁడనియు చెప్పఁబడుచున్నాఁడు.

ఆత్మోద్ధరణ ఆత్మవలననే కలుగును. ఇందుచేతనే తనకు తానే శత్రువును, మిత్రుఁడును అగుచున్నాఁ డని చెప్పవచ్చును. మనస్సును జయించినవానికి తనయాత్మ మిత్రుఁడును, జయింపనివానికి శత్రువు నగును. మనస్సును జయించినవానికి శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు సమానముగా నుండుటయే గుర్తు. ఎవనికి జ్ఞానము, అనుభవము, స్థిరత్వము నున్నవో, యెవఁ డింద్రియములను జయించినాఁడో, యెవనికి బంగారము, మట్టి, ఱాయి, మొదలగున వన్నియు సమానములో వాఁడు యోగి. అట్టిమనుష్యుఁడు శత్రుమిత్రులయందును,

సాధు-అసాధులయందును సమభావము కలిగియుండును. ఈస్థితిని చేరుటకు మనస్సు స్థిరముగా నుండవలయును. వాసనలను త్యజింపవలయును. ఏకాంతముగాకూర్చుండి పరమాత్మని ధ్యానించు చుండవలయును. ఆసనములు వేయుటమాత్రమే చాలదు. సమత్వమునుబొంద నిచ్ఛగలవాఁడు బ్రహ్మచర్యాది మహావ్రతములను బాగుగా పాలింపవలయును. ఇట్లు ఆసనబద్ధుఁడై యమ నియమములనుపాలించువాఁడు తనమనస్సును పరమాత్మయందు స్థిరముగా నుంచినపుడాతనికి పరమశాంతి కలుగును.

ఎక్కువగా భుజించువానికిఁగాని, కేవల ముపవాసము చేయువానికిఁగాని, యెక్కువనిద్రించువానికిఁగాని,యెల్లపుడును జాగరణము చేయువానికిఁగాని సమత్వము కలుగదు. సమత్వమును బొంద నిచ్ఛగించువాఁ డన్నపానాదులయందు, నిద్రాజాగరణములయందుఁగూడ నియమము గలిగియుండవలయును. ఒకరోజున పూర్తిగా తినుట, రెండవదిన ముపవసించుట; ఒకరోజున పూర్ణముగా నిద్రించి, రెండవరోజున జాగరణము చేయుట; ఒకరోజున నత్యధికముగా పని చేసి రెండవరోజును సోమరితనమందుఁ గడపుట-ఇవి యోగికి లక్షణములు కావు. యోగి సర్వదా స్థిరచిత్తుఁడుగా నుండును. కామముల నన్నింటిని స్వభావముగనే త్యజించును. అట్టియోగిస్థితి గాలి లేనిస్థలమున నున్నదీపమువలె స్థిరముగా నుండును. జగన్నాటకమందు జరగు ఆటపాటలు, వినోదములుగాని ఆతనిమనస్సునందు కలుగువిచారతరంగములు గాని, యాతనిని చలింపఁజేయఁజాలవు. ఈయోగము క్రమక్రమముగా దృఢనిశ్చయముతో ప్రయత్నించిన సాధింపవచ్చును. మనస్సు చంచలమైనది గాన నది యటు నిటుఁ బరుగిడును. దానిని మెల్ల మెల్లఁగా స్థిరము చేయుట యుచితము. స్థిరము కాఁగానే శాంతి కలుగును. మనస్సు నీవిధముగా స్థిరము చేయుటకు నిరంతరము ఆత్మ

చింతనము చేయుచుండవలయును. అట్టివాఁడు సర్వజీవులను తనయందును, తన్ను అన్నిటియందును చూచును. ఏలయన వాఁడు నన్నన్నిటియందును, నాయందన్నిటినిఁ జూచును. ఎవఁడు నాయందు లీనమగునో వాఁడు సర్వత్ర నన్నుఁ జూచును. వానియందహంకారము నశించును. కనుక వాఁ డేపిచేయుచున్నను నాయందు లీనుఁడై యుండును. కాన నాతనిచేతులద్వారా చేయఁగూడనికార్యమేదియు నెప్పుడును జరుగదు.

అర్జునునకీయోగము కఠినముగా తోఁచినది. అతఁడిట్లు ప్రశ్నించెను: "ఆత్మకు స్థిరత్వ మెట్లు గలుగును? మనస్సు కోఁతివంటిది. గాలిని అణఁచుటసాధ్యమగుచో మనస్సును స్వాధీనపఱుచుకొనుటయు సాధ్యమగును. ఇట్టియీమనస్సు ఎప్పుడు, ఎట్లు స్వాధీనమునకు రాఁగలదు?"

భగవానుఁ డిట్లు చెప్పెను:—"నీవు చెప్పినది నిజమే; కాని రాగద్వేషములను జయించుటవలనను, ప్రయత్నము చేయుటవలనను కఠినమైనది సుకరము కాఁగలదు. మనస్సును జయింపక యోగము సాధింపఁబడఁజాలదు. ఇందు సందేహ మేమియు లేదు."

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను:—

"మనుష్యునియందు శ్రద్ధ యున్న దనుకొనుఁడు. కాని ఆతని ప్రయత్నము మంద మగుటచే వాఁడు సఫలతను బొందఁజాలఁడు. ఇట్టి వానిగతి యేమి? చెదరిన మేఘములవలె నతఁడు నశింపఁడా?"

భగవానుఁ డిట్లు చెప్పెను:— అట్టిశ్రద్ధాళుఁడు నశింపనే నశింపఁడు. కల్యాణమార్గమందు నడచువాని కధోగతి కలుగఁజాలదు. అట్టివాఁడు చచ్చినపిదపఁ గర్మానుసారముగ పుణ్యలోకమందుండి పృథ్విపైఁ జేరును. మఱియు పవిత్రమైనకుటుంబమున జన్మించును. ఈ లోకమునం దట్టిజన్మము దుర్లభము. అయింటియం దాతనిపూర్వశుభసంస్కారోదయ మగును. ఈపర్యాయ మాతనిప్రయత్నములు

తీవ్రముగా నుండును. అంతమున వాఁడు సిద్ధిని బొందును. ఈవిధముగఁ బ్రయత్నము చేయుచుండిన కొందఱు త్వరితముగాను కొందఱనేకజన్మములు గడచినపిదపను తమతమ శ్రద్ధా ప్రయత్నముల బలము ననుసరించి సమత్వమును బొందుదురు. తపస్సు, జ్ఞానము, కర్మకాండము వీనియన్నిటికంటె సమత్వ మధిక మైనది. ఏల యన తపస్సు మొదలగు వానిపరిణామము తుదకు సమత్వమే యైయుండవలయును. కాన నీవు సమత్వమును బొందుము; యోగివి కమ్ము. వీరిలోఁగూడ నెవరు తమసర్వస్వము సమర్పించెదరో, నన్నే యారాధించెదరో వారిని శ్రేష్ఠు లని తెలిసికొనుము.

టిప్పణి:—

ఈయధ్యాయమందు ప్రాణాయామము, ఆసనము మొదలగునవి చెప్పఁబడినవి. వీనితోఁగూడ బ్రహ్మచర్యము-బ్రహ్మప్రాప్తి కొఱకు యమ నియమాది వ్రతములఁ బాలించుటకుఁగల ఆవశ్యకమును గూడ భగవానుఁడు చెప్పినాఁ డని జ్ఞాపక ముంచుకొనవలయును. కేవలము ఆసనాదిక్రియలచే సమత్వము లభింప దని తెలిసికొను టవసరము. ఆసన ప్రాణాయామాదులు మనస్సును స్థిరపఱుచుకొనుటకును, ఏకాగ్రతను పొందుటకును చేసినచోఁ గొంతవఱకు సాయపడఁగలవు. లేనియెడల నితర వ్యాయామములవలె ప్రాణాయామముగూడ శరీరపరిశ్రమకై యుపయోగపడును. ఈ వ్యాయామము సాత్త్విక మైన దని తలంచెదను. శారీరకదృష్టితో నభ్యసింపఁదగినది; కాని దీనివలన సిద్ధులను బొందుటకు, చమత్కారములఁ జూపించుటకు నీక్రియలు చేయఁబడుచుండుట నే నెఱుఁగుదును. దానివలన లాభమునకు బదులు నష్టమే కలుగును. ఈయధ్యాయము, మూఁడు, నాల్గు, ఐదు అధ్యాయముల కుపసంహార మని గ్రహింపనగును. ప్రయత్నశీలున కీయధ్యాయ మభయ మిచ్చుచున్నది. ఈవిధముగా సమత్వమును బొందు ప్రయత్నము వదలకుండుముగాక.

# సప్తమాధ్యాయము

## జ్ఞానవిజ్ఞానయోగము

శ్రీ కృష్ణభగవానుఁ డిట్లు చెప్పెను :—

ఓరాజా! నాయందు మన సుంచి నన్నాశ్రయించి కర్మ యోగము నాచరించువాఁడు నిశ్చయముగా, సంపూర్ణముగా నన్నెట్లు గుర్తింపఁగలఁడో యది నీకుఁ జెప్పెదను. అనుభవయుక్తమైన యీ జ్ఞానమును నీ కుపదేశించెదను. దీనిని తెలిసికొనినపిమ్మట మఱేమియు తెలిసికొనుటకు మిగిలియుండదు. వేలకొలఁది జనులలో కొందఱే దీనిని పొందుటకు ప్రయత్నింతురు. ప్రయత్నించువారిలోను కొందఱే సఫలతను పొందుదురు.

పృథ్వి, ఆకాశము, నీరు, తేజము, వాయువు, మనస్సు, బుద్ధి, అహంకారము అను నెనిమిదివిధములు గలది నాప్రకృతి. దీనిని అపర ప్రకృతి యందురు. రెండవది పరాప్రకృతి. జీవరూపమైనది. ఈ రెండుప్రకృతులచే, అనఁగా దేహమునకు, జీవునితోఁ గలసంబంధము వలన జగత్తునిర్మాణమైనది. కనుక సకలోత్పత్తిలయములకును నేనే కారణము. జగత్తంతయు, నా ఆధారముపై నున్నది. అనఁగా నీటియందలి రసము నేను. సూర్యచంద్రుల తేజము నేను. వేదము నందలి ఓంకారము నేను. ఆకాశముయొక్క ధ్వని, పురుషుల పరాక్రమము, పృథ్వియొక్క సుగంధము, అగ్నియొక్క తేజము, సర్వప్రాణులజీవము, తపస్వియొక్క తపము, బుద్ధిమంతునిబుద్ధి, బలవంతుని

శుద్ధబలము, సర్వభూతములయొక్క ధర్మవిరుద్ధము గాని కోరికయు నేనే. సంక్షేపముగాఁ జెప్పిన సత్త్వ రజ స్తమో గుణములవలన పుట్టుభావము లన్నియు నావలననే పుట్టునవి యని తెలిసికొనుము. ఇవి యన్నియు నాయాధారముననే యుండఁగలవు. ఈ మూఁడు భావములయందు-గుణములయందు-ఆసక్తు లై యుండువారు నాశన రహితుఁడ నగునన్ను గుర్తింపఁజాలరు. ఇదియే నా త్రిగుణాత్మకమగు మాయ. దీనిని దాఁటుట కష్టము. కాని న న్నాశ్రయించువా రీమా యను-త్రిగుణములను-దాఁటఁగలరు.

కాని యెవరియాచారవిచారములకు మేర లేదో ఆమూఢులు నాశరణంగులకుఁ జొచ్చెదరు? వారు మాయలోపడి యంధకారమందు దారి తప్పి తిరుగుచుందురు. జ్ఞానమును పొందరు. అయితే మంచి యాచరణ గలవారు నన్ను భజించెదరు. వారిలో కొందఱు తమదుఃఖ ములను పోఁగొట్టుకొనుటకును, కొందఱు నన్ను తెలిసికొనవలయు నను కోరికతోను నన్ను భజింతురు. నన్ను భజించుట యన, జగత్తు నకు సేవ చేయుటయే. వీరిలో కొందఱు దుఃఖమువలనను, కొందఱు లాభమును పొందవలయు నను ఆశచేతను, కొందఱు 'చూతాము. ఏమగునో' అనుభావముచేతను సేవ చేయుచుందురు. మఱికొందఱు జ్ఞానపరాయణులు సేవచేయక యుండఁజాలరు గాన సేవ చేయుచునే యుందురు. ఈకడపటితరగతివారు నాభక్తులు-జ్ఞానులు. వీరు నా కందఱిలోను అధికమగు ప్రియులు. వీరు న న్నత్యధికముగ తెలిసి కొనుచున్నా రనియు నాకు చాల సమీపములోనివా రనియు చెప్పఁ దగును. మానవున కీజ్ఞాన మనేకజన్మములతరువాతనే కలుగును. ఈ జ్ఞానము లభించినపిదప వాఁడీజగత్తున నన్ను-వాసుదేవుని-తప్ప మఱేమి యును చూడనేచూడఁడు. కామము గలవారు వేలువేలు దేవతలను

భజింతురు. వారివారి భక్తి ననుసరించి ఫలము నిచ్చువాఁడను నేనే. అట్టి అల్పజ్ఞులకు లభించుఫలము గూడ తక్కువగనే యుండును. వారికి దానియందు సంతోషముగూడ కలుగును. వా రల్పబుద్ధి గలవా రగుటచే నింద్రియములద్వారా నన్ను తెలిసికొనఁగల మనుకొనుచున్నారు. అవినాశియు, అద్వితీయమునగు నారూప మింద్రియాతీత మైన దనియు చెయ్యి, చెవి, ముక్కు, కన్ను, మొదలగు ఇంద్రియములచే తెలిసికొనుటకు వీలు లే దనియు వారు గ్రహించుటలేదు. అన్నివిధములగువస్తువులను సృజించువాఁడ నైనను నన్ను జ్ఞానులు గుర్తింపఁజాలరు. నాయీ యోగమాయను నీవు తెలిసికొనుము. రాగద్వేషములవలన సుఖదుఃఖాదులు కలుగుచుండును. వీనిచే జగత్తు మూర్ఛిల్లి, మోహములో పడియుండును. వీనినుండి ముక్తులైనవారును, ఆచారవిచారములందు నిర్మలులైనవారును, తమవ్రతమందు నిష్ఠగలిగియుండి నిరంతరము నన్నే భజించుచుందురు. సర్వప్రాణులయందును, భిన్నభిన్నముగ కనుపడు జీవరూపములో నున్న నన్నును, నాకర్మమును, నా పూర్ణముగు బ్రహ్మరూపమును తెలిసికొందురు. ఈవిధముగ నన్ను నెవరు అధిభూత, అధిదైవ, అధి యజ్ఞరూపముగ తెలిసికొని తత్ఫలితముగ సమత్వమును పొందుదురో వారు మరణించినపిదప, జననమరణబంధములనుండి విముక్తు లగుదురు. ఏల యన ఇది తెలిసికొనిన పిమ్మట వారి మనస్సు అన్యత్ర సంచరింపదు. సర్వజగత్తును ఈశ్వరమయముగఁ జూచువా రీశ్వరునియందే లీన మగుదురు.

---

# అష్టమాధ్యాయము

## అక్షరబ్రహ్మయోగము

అర్జునుఁ డిట్లడిగెను:—

నీవు పూర్ణబ్రహ్మము, అధ్యాత్మ, కర్మము, అధిభూతము, అధిదైవము, అధియజ్ఞ మను పేర్లు చెప్పితివి. కాని నా కీశబ్దముల యర్థము తెలియకున్నది. ఇంతియేకాక నిన్ను అధిభూతరూపమున తెలిసికొనువారు సమత్వమును పొందుదు రనియు, మృత్యుసమయమున నిన్ను గుర్తించెద రనియు చెప్పియుంటివి. ఇది యంతయు నాకు తెలియఁ జెప్పుము.

భగవానుఁ డిట్లు ప్రత్యుత్తర మొసఁగెను:—

సర్వోత్తమ మైన నాశరహితమగు స్వరూపమే పూర్ణబ్రహ్మము. జీవులయందు కర్తృ, భోక్తృ రూపముతో దేహధారణ కలిగియున్నది అధ్యాత్మము. ఏ క్రియవలన జీవులు జన్మించుచున్నవో దాని పేరు కర్మము. అనఁగా దేనివలన సర్వము నుత్పత్తి యగుచున్నదో, దానిని కర్మ మనవచ్చును. అధిభూత మనఁగా సృష్టి రూపమున నున్న నా నాశవంతమగు శరీరము. అధియజ్ఞ మనఁగా, యజ్ఞమువలన పరిశుద్ధ మైన ఆధ్యాత్మస్వరూపము. ఈవిధముగా దేహరూపమునను, జీవరూపమునను, మఱియు పూర్ణబ్రహ్మరూపమునను సర్వత్ర నేనే యున్నాను. ఇట్టి నన్ను నెవఁడు మృత్యుసమయ

మున ధ్యానించునో, ఎవఁడు తన్ను మఱచిపోవునో, ఎవఁ డేవిధ మగు నన్యచింతను చేయఁడో, కోరఁడో, అట్టివాఁడు నా స్వరూపమును పొందును. ఇది నిశ్చయమని తెలిసికొనుము. మనుష్యుఁ డేస్వరూపమును నిత్యము ధ్యానించునో, అంత్యకాలమందును ఆ ధ్యానమే యున్నచో, వాఁ డాస్వరూపమును పొందును. కనుక నీవు నిత్యము నన్నే స్మరింపుచు, నా యందే మనోబుద్ధుల నుంచుచో, నన్నే పొందుదువు. ఈ విధముగా చిత్తము స్థిరముగా నుండ దని చెప్పెదవా? నిత్యము నభ్యాసము చేయుచో, ప్రతిదినము ప్రయత్నించుచో, ఇట్టి యేకాగ్రత లభించు నని జ్ఞాపక ముంచుకొనుము. మూలమును విచారించుచో, దేహధారిగూడ నా స్వరూపమే యని నీ కిప్పుడే చెప్పియుంటిని. కనుక మనుష్యుఁడు మృత్యుసమయమందుఁగూడ నస్థిరుఁడు గాకుండుటకు ప్రప్రథమముననుండియే సంసిద్ధుఁడు గావలయును. భక్తిలో లీనము గావలయును. ప్రాణములను స్థిరముగా నుంచుకొనవలెను. సర్వజ్ఞుఁడును, పురాతనుఁడును, నియంతయును, సూక్ష్మరూపముతో నుండియు నందఱను పాలింప శక్తి గలిగియున్నవాఁడును, ధ్యానించుచున్నను శీఘ్రముగా గుర్తింపఁబడనివాఁడును, సూర్యునివలె నజ్ఞానాంధకారమును పాఱఁద్రోలువాఁడు నగుపరమాత్మనే స్మరింపుము. ఈ పరమపదమును వేదము లక్షరబ్రహ్మమని చెప్పుచున్నవి. రాగద్వేషాదులను వదలినమును లీపరమపదమును పొందుదురు. ఈ పదవిని పొందఁగోరువా రందఱును బ్రహ్మచర్యమును పాలింతురు. అనఁగా శరీరమును, మనస్సును, వాక్కును స్వాధీనమం దుంచుకొందురు. (త్రికరణశుద్ధిగా) మనోవాక్కర్మములయందును విషయములను త్యజింతురు. ఇంద్రియములను వశమం దుంచుకొని "ఓం" కారము నుచ్చరించుచు, నన్నే చింతించుచు శరీరమును త్యజించు స్త్రీపురుషు

లీపరమపదమును పొందుదురు. అట్టివారి చిత్తము మరెచ్చటను భ్రమింపదు. ఈ విధముగా నన్ను పొందువారికి దుఃఖభూయిష్ఠమగు జన్మమెత్త నవసర ముండదు. ఈ జన్మమరణసంసారచక్రముననుండి విముక్తిని పొందుటకు మార్గము నన్ను పొందుటయే. మనుష్యుఁడు తన నూఱుసంవత్సరముల జీవితకాలమును లెక్కించి, యీకాలమున వేలకొలఁది కష్టములు పన్నును. కాల మనంత మయినది. వేలకొలఁది యుగములు బ్రహ్మ కొకదిన మని తెలిసికొనుము. కనుక మానవుని యొకదినముగాని, నూఱు సంవత్సరములుగాని యొక లెక్కలోనికి రావు. స్వల్పకాలమును లెక్కించుకొని వ్యర్థముగా దుఃఖింపనేల? ఈ యనంతకాలచక్రమునందు మనుష్యుని జీవితము క్షణమాత్రకాలము. ఈ క్షణకాలమునం దీశ్వరధ్యానము చేయుటయే శివంకరము. క్షణికభోగముల కేల యాశపడవలయును? బ్రహ్మయొక్క రాత్రి, పగటియం దుత్పత్తియు నాశనము జరగుచున్నది. జరగఁగలదు. ఉత్పత్తిలయములను జేయు నీబ్రహ్మగూడ నా భావమే. మఱియు నిది యవ్యక్తము. ఇంద్రియముల కిది గోచరము కాదు. దీనికంటె పరముగా నాది మఱియొక యవ్యక్త స్వరూపము గలదు. నీ యెదుట దానిని కొంత వర్ణించితిని. దానిని పొందినవాఁడు జననమరణముల వలన విముక్తుఁ డగును. ఆ స్వరూపమునకు రాత్రి పగలు మొదలగు ద్వంద్వము లుండవు. అది కేవలము శాంత మగు నచలస్వరూపము. దాని దర్శన మనన్యభక్తివలననే కలుగును. దాని యాధారముమీఁదనే జగ త్తంతయు నిలిచియున్నది. మఱియు నా స్వరూపము సర్వత్ర వ్యాపించియున్నది.

ఉత్తరాయణమందు శుక్లపక్షదినములలో పగలు మరణించువాఁడు పైన చెప్పఁబడిన ప్రకారము స్మరించుచు నన్ను పొందును.

## ౮. అక్షరబ్రహ్మయోగము

దక్షిణాయనమందు కృష్ణపక్షములో రాత్రి మరణించువాఁడు పునర్జన్మ మెత్తును. దీని కీవిధముగా నర్థము చెప్పవచ్చును. ఉత్తరాయణ శుక్లపక్ష మనఁగా, నిష్కామసేవామార్గము. దక్షిణాయన మనఁగా స్వార్థమార్గము. సేవామార్గము నవలంబించిన ముక్తియును, స్వార్థ మార్గ మవలంబించిన బంధనమును ప్రాప్తమగును. సేవామార్గము జ్ఞాన మార్గము, స్వార్థమార్గ మజ్ఞానమార్గము. జ్ఞానమార్గమున నడచువానికి మోక్షమును, అజ్ఞానమార్గమున నడచువానికి బంధనమును గలుగును. ఈ రెండుమార్గములను తెలిసికొనిన తరువాత మోహమునఁ జిక్కుకొని యజ్ఞానమార్గము నెవఁడు వాంఛించును? ఇది తెలిసికొని సర్వమానవులును సమస్తపుణ్యఫలములను వదలి, అనాసక్తులై కర్తవ్యమందు నిమగ్నులై నేఁ జెప్పిన యుత్తమస్థానమును పొందుటకు ప్రయత్నము చేయవలయును.

---

# నవమాధ్యాయము

## రాజవిద్యారాజగుహ్యయోగము

క్రిందటి యధ్యాయమున చివర శ్లోకమందు భగవానుఁడు యోగియొక్క ఉన్నత పదవినిగూర్చి నుడివెను. కాన యిప్పుడు భక్తి మహిమనుగూర్చి చెప్పవలసియున్నది. ఏల యన గీతయందు చెప్పఁబడిన యోగి శుష్కజ్ఞానియును, కపటభక్తుఁడును కాఁడు. ఈ యోగి సజ్ఞానభక్తితోఁ గూడిన నిష్కామకర్మమును చేయువాఁడు. కనుక భగవంతు డిట్లు చెప్పుచున్నాఁడు, "నీయందు ద్వేషము లేదు గాన నేను నీకు పరమరహస్యమగు జ్ఞానమును బోధించుచున్నాను. దీనిని తెలిసికొనిన నీకు కల్యాణ మగును. ఈ జ్ఞానము సర్వోత్కృష్టమైనది. పవిత్రమైనది. సులభముగాఁ దీని నాచరింపవచ్చును. ఎవని కిందు శ్రద్ధ యుండదో వాఁడు నన్ను పొందఁజాలఁడు. మనుష్యులింద్రియములచే నా స్వరూపమును గుర్తింపఁజాలరు. అయినప్పటికిని ఈ జగత్తునందది వ్యాపించియున్నది. దాని యాధారముననే జగత్తు నిలిచియున్నది. కాని అది జగత్తుయొక్క యాధారముమీఁద లేదు. ఒక విధముగాఁ నీప్రాణులు (జీవులు) నాయందు లేవనియు చెప్పవచ్చును. అయినప్పటికిని జీవుల యుత్పత్తికి కారణము నేను. వానిని పోషించువాఁడను నేను. అవి నా యందు లేవు; నేను వానియందు లేను. ఏల యన నవి యజ్ఞానమందుండి నన్ను తెలిసికొనుట లేదు. వానియందు భక్తి లేదు. దీనిని నా చమత్కార మని తెలిసికొనుము.

# ౨౦ ౯. రాజవిద్యా రాజగుహ్యాయోగము

నేను జీవులయందు లేనట్లు కనుపించుచున్నను వాయువువలె సర్వత్ర వ్యాపించియున్నాను. సర్వజీవులు యుగ మంతరింపఁగనే లయమును బొందును. యుగ మారంభము కాఁగానే పునర్జన్మమును పొందును. ఈ కర్మములకు కర్తను నేను. కాని నా కీకర్మములయం దాసక్తిలేదు గాన నా కివి బంధనములు కావు. వీని విషయమున నే నుదాసీనుఁడను. ఇది నా ప్రకృతి-నా స్వభావము-కాన యీకర్మములు జరగుచునేయుండును. కాని లోకులు నా యీరూపమును గుర్తింపరు. కనుక నాస్తికులుగ నుందురు. నా-అస్తిత్వమునే నమ్ముటలేదు. అట్టివారు వ్యర్థమగు ఆశాసౌధములు నిర్మించుచుందురు. వారి పనులు గూడ వ్యర్థము లగును. వా రజ్ఞానముతో నిండియుందురు. కాన వారు రాక్షసవృత్తిగలవా రని చెప్పఁబడుదురు. దైవవృత్తి గలవారు నన్ను అవినాశి యనియు, సృష్టికర్త యనియు తెలిసికొని భజింతురు. వారికి దృఢనిశ్చయ ముండును. వారు నిత్యము ప్రయత్నశీలురుగ నుందురు. నన్ను భజింతురు. నన్ను ధ్యానింతురు. కొందఱు నే నొకఁడనే యున్నా నని నమ్ముదురు. కొందఱు నే ననేకరూపములు గలవాఁడ నని నమ్ముదురు. నా గుణము లనంతములు. అనంతరూపములు గలవాఁడ నని నమ్మువా రనేకరూపములు కల్పించి భజించుచున్నారు. వీ రందఱును భక్తు లని తెలిసికొనుము. యజ్ఞముయొక్క సంకల్పము నేను. యజ్ఞము నేను. పితరుల కాధారము నేను. యజ్ఞముయొక్క వనస్పతి నేను. మంత్రములు నేను. ఆహుతి నేను. హోమ మందు వేయు ద్రవ్యమును నేను. అగ్నియు నేను. ఈ జగత్తునకు తండ్రిని నేను. తల్లిని నేను. ఈజగత్తున కాధారభూతుఁడను, పితామహుఁడను నేను. తెలిసికొనఁదగిన వస్తువును, ఓంకారమును, ఋగ్వేదమును, సామవేదమును, యజుర్వేదమును నేనే. గతిని, పోషకుఁడను,

ప్రభువును, సాక్షిని, ఆశ్రయుండను, కల్యాణమును కోరువాడను గూడ నేనే. ఉత్పత్తిని, నాశనమును, శీతోష్ణములును, సదసత్తులును నేనే యైయున్నాను. కొందఱు ఫలప్రాప్తికొఱకు వేదములందు వర్ణించిన కర్మములను చేయుదురు. వారికి స్వర్గము లభించినను, జనన మరణ చక్రముననుండి తప్పించుకొనరు. కాని యెవరు తదేకభావముతో నన్ను చింతన చేయుదురో, నన్నే భజింతురో వారి భార మంతయు నేను మోయుదును వారి యవసరములను నేను తీర్చెదను. వారి యోగక్షేమములు నేనే వహించెదను. మఱికొంద ఱితరదేవతలయందు శ్రద్ధ నుంచి వారిని భజింతురు. ఇం దజ్ఞానము గలదు. అయినను చివ రకు వారు నన్నే భజించువారుగా పరిగణింపఁబడుదురు. ఏల యన సర్వయజ్ఞములకును స్వామిని నే నయియున్నాను. నా యీ వ్యాప కత్వమును గ్రహింపనిది వా రంతిమ స్థితిని పొందఁజాలరు. దేవతలను పూజించువారు దేవలోకమును పొందుదురు. పితరులను పూజించు వారు పితృలోకమును, భూతప్రేతాదులను పూజించువా రాయాలోక ములను పొందుదురు. జ్ఞానపూర్వకముగా నన్ను భజించువారు నన్ను పొందెదరు. ఎవరు నా కొకపత్ర మైనను భక్తిపూర్వకముగా నర్పిం చుదురో అట్టి ప్రయత్నశీలు రగు వారి భక్తిని నేను స్వీకరించుచు న్నాను. కనుక నీ వేది చేసినను నా కర్పించి చేయుము. దీనివలన కర్మఫలముయొక్క శుభాశుభముల బాధ్యత నీయం దుండదు. నీవు కర్మఫలములను త్యజించుటచే జననమరణములనుండి విముక్తుఁడ వగు దువు. నాకు సర్వప్రాణులును సమానము. ఒకజీవి ప్రియము, మఱి యొకజీవి యప్రియము అనునది లేదు. కాని యెవరు భక్తిపూర్వక ముగా నన్ను భజింతురో వారియందు నే నుందును. ఇందు పక్షపా తము లేదు. కాని వారు తమ భక్తికి ఫలమును పొందుదురు. ఈభక్తి

## ౯. రాజవిద్యా రాజగుహ్యయోగము

యందుఁగల చమత్కార మే మన, ఎవఁడు నన్ను తదేకభావముతో భజించునో వాఁడు దురాచారుఁ డైనను సాధు వగును. సూర్యుని యెదుట నంధకార మెట్లుండఁజాలదో అట్లే నా యెదుటికి రాఁగానే మనుష్యుని దురాచారము నశించును. కనుక నాయందు భక్తిగలవా రెప్పటికిని నశింప రని నీవు నిశ్చయముగా తెలిసికొనుము. వారు ధర్మాత్ములై శాంతిని బడయుదురు. నా భక్తిమహిమ యెట్టి దన, పాపయోనులందు జన్మించినవా రని తలంపఁబడువారును, విద్యావిహీన లగు స్త్రీలును, వైశ్యులును, శూద్రులును న న్నాశ్రయించుచో నన్నే పొందుదురు. ఇఁక పుణ్యకర్మములఁ జేయు బ్రాహ్మణ క్షత్రియుల విషయమున చెప్ప నేల? భక్తిగలవానికి దానిఫలము లభించును. నీ వసారసంసారమందు జన్మించినావు గాన నన్ను భజించి దీనిని దాఁటుము. నీమనస్సును నాయం దుంచుము, నాభక్తుఁడ వగుము. నీవు యజ్ఞము గూడ నాకొఱకు చేయుము, నన్ను నమస్కరింపుము. ఇట్లు నీవు నాయందు పరాయణుఁడ వైనచో, నీయాత్మను నాయందు హోమము చేసి నీ వహంకారశూన్యుఁడవగుచో నన్నే పొందుదువు.

### టిప్పణి

దీనివలన మనము గ్రహించున దేమన భక్తి యనఁగా ఈశ్వరునియం దాసక్తి. అనాసక్తిని నేర్చుకొనుటకుఁ గూడ నిది యత్యంత సులభమగు మార్గము. భక్తి, రాజయోగ మనియు, సులభమార్గ మనియు నీ యధ్యాయము ప్రారంభమున ప్రతిజ్ఞ చేయఁబడియుండెను. భక్తుల కీమార్గము సరళముగను, భక్తిలేని వారి కీమార్గము కష్టముగను దోఁచును. భక్తికై సర్వార్పణము చేయవలెను. అజ్ఞానులకు దుఃఖమయముగను, జ్ఞానుల కానందమయముగను, గనుపడును. ఇందు కనియే ఇది

తల నొప్పివంటి దని చెప్పఁబడెను. మహాభక్తుఁడగు సుధన్వుఁడు కాఁగుచున్న నూనెయందుఁ ద్రోయఁబడినను నవ్వుచుండెను బయట దూరమున నిలిచి చూచువారు గడగడ వడఁకిపోవుచుండిరి. అంత్యాజుఁడగు నందున కగ్ని పరీక్ష జరగినపు డాతఁ డగ్నిలో నృత్యము చేయుచుండెను. ఇవి యన్నియుఁ వారి జీవితమునందు తటస్థించినవో లేదో యిచ్చట చర్చింప నవసరము లేదు. ఎవఁ డే వస్తువునందైనను లీన మైనచో వానిస్థితి యిటులే యుండును. వాఁడు తన్ను మఱచిపోవును. కాని ప్రభువును వదలి తదితర మైనదానిలో నెవఁడు లీన మగును? చెఱకురసమును వదలి వేఁపరసమును గ్రోలకుము సూర్యచంద్రుల ప్రకాశమును వదలి మెఱుఁగుడుపురుగు నాశ్రయింపకుము. ప్రభువు నం దాసక్తి యనఁగా భక్తి లేనిది, ఫలమం దనాసక్తి యసంభవ మని తొమ్మిదవయధ్యాయము చెప్పుచున్నది. చివరశ్లోక మీయధ్యాయ మంతటికిని సారము. దీనియర్థ మిది "నీవు నాయం దైక్యమగుము."

---

# దశమాధ్యాయము

---

## విభూతియోగము

భగవంతుఁ డిట్లు చెప్పెను:—

"మరల భక్తుల కొఱకై చెప్పుచున్నాను, వినుము. దేవతలు, మహర్షులు గూడ నాయుత్పత్తి నెఱుఁగరు. ఏల యన నాకు జన్మింప నవసరము లేదు. నేనే వారందఱి యుత్పత్తికిని కారణము. నాకు జన్మమును, ఆదియు లేవని తెలిసికొను జ్ఞానియే సర్వపాపములనుండి విముక్తుఁ డగును. ఏలయన పరమేశ్వరుని యీ సత్యస్వరూపమును తెలిసికొనిన తరువాత,—తన్ను నాతని సేవకుఁ డనియు లేక యాతనియంశ రూపముగ నున్నాననియు గుర్తెఱిఁగినపిమ్మట, మనుష్యునియందు పాపవృత్తి యుండఁజాలదు. తన విషయమైన యజ్ఞానమే పాపవృత్తికి మూలకారణము. నావలన జీవు లెట్లు న్నుత్పన్నులగుచున్నారో యట్లే వారి భిన్నభిన్న భావములు—క్షమ, సత్యము, సుఖదుఃఖములు, జన్మమృత్యువులు, భయాభయములు, మొదలగునవి యన్నియుఁగూడ నావలననే యుత్పన్నము లగుచున్నవి. ఇవి యన్నియు నా విభూతి యని తెలిసికొనువారికి సహజముగనే సమత్వము కలుగును. ఏలయన వా రహంకారమును వదలుదురు. మఱియు వారి చిత్తము నాయందే లగ్నమైయుండును. వారు నాకు సర్వస్వము నర్పణచేయుదురు. నన్నే కీర్తించుచు, ఆనందముగా నుందురు. ఈ విధముగా ప్రేమపూర్వకముగా నన్నెవరు భజింతురో, నాయందే యెవరి మనము లగ్నమైయుండునో వారికి నేను జ్ఞాన మొసఁగుదును. దానివలన వారు నన్ను పొందుదురు."

అటుపిమ్మట అర్జునుఁ డీవిధముగా స్తోత్రము చేసెను. "నీవే పర బ్రహ్మమవు, పరమధామమవు, పవిత్రుఁడవు నైయున్నావు. ఋష్యాదులు నిన్ను దేవుఁడ వనియు, జన్మరహితుఁడ వనియు, నీశ్వరుఁడ వనియు భజించుచున్నారు. నీవే స్వయముగా నిది చెప్పితివి. ఓ స్వామీ, ఓతండ్రీ, నీ స్వరూప మెవ్వరు నెఱుఁగరు: నిన్ను నీవే యెఱుంగుదువు! నీవు నీవిభూతులను నాకు చెప్పుము. చింతనచేసి ని న్నేవిధముగా గుర్తింప గలనో చెప్పుము."

భగవానుఁడు ప్రత్యుత్తర మొసఁగెను :—

"నా విభూతు లనంతములు. ముఖ్యమైన వానిని నీకు చెప్పుచున్నాను. నేను సర్వజీవుల హృదయములందును నివసించు వాఁడను. సర్వ భూతములయొక్క యాదియు, మధ్యము, నంతమును నేనే. ఆదిత్యులలో విష్ణుఁడను నేనే. ప్రకాశవంతములగు వస్తువులలో కెల్ల ప్రకాశవంతుఁడగు సూర్యుఁడను నేనే. వసువులలో మరీచిని, నక్షత్రములలో చంద్రుఁడను, వేదములలో సామవేదమును, దేవతలలో నింద్రుఁడను, ఇంద్రియములలో మనస్సును, ప్రాణులలోని చేతన శక్తిని, రుద్రులలో శంకరుఁడను, యక్షరాక్షసులలో కుబేరుఁడను, దైత్యులలో ప్రహ్లాదుఁడను, పశువులలో సింహమును, పక్షులలో గరుడుఁడను నేనే. మఱియు మోసము చేయువారల జూదమును గూడ నేనే. ఈ ప్రపంచమున నుండున దంతయు, నాయాజ్ఞ లేనిది యుండఁజాలదు. మంచి చెడుగులు గూడ నేనే జరగనిచ్చుచున్నాను. కావుననే జరగుచున్నవి. ఇదితెలిసికొని మనుష్యుఁడభిమానమును వదలవలయును. చెడుగు నుండి తప్పించుకొనవలయును. ఎందుల కన మంచిచెడుగులకు ఫలితము నిచ్చువాఁడను గూడ నేనే. నా విభూతియొక్క యొకయంశముచేతనే యీప్రపంచమంతయు నిలిచియున్నదని నీవు తెలిసికొనుము".

---

౧౧

# ఏకాదశాధ్యాయము

---

## విశ్వరూపదర్శనయోగము

అర్జునుఁ డిట్లు విన్నవించెను:—

“ఓభగవంతుఁడా! నీవు నా కాత్మను గుఱించి చెప్పితివి గాన నా మోహము తొలఁగినది. నీవే సర్వమును. నీవే కర్తవును, సంహారకర్తవు నైయున్నావు. నీవే నాశరహితుఁడవు. సాధ్య మగుచో నీ యీశ్వరరూపదర్శనము నాకు కలుగఁజేయుము”.

భగవంతుఁడు చెప్పెను:—

“నా రూపములు వేలకొలఁదిగను, పలురంగులు గలవిగను ఉన్నవి. వానియందు ఆదిత్యులు, వసువులు, రుద్రులు మొదలగువా రెల్లరు నిమిడియున్నారు. చరాచరమగు జగత్తంతయు నిమిడియున్నది. ఈ రూపమును నీవు నీచర్మచక్షువులతోఁ జూడఁజాలవు. కనుక నేను, నీకు దివ్యనేత్రముల నిచ్చుచున్నాను. వీనివలన దీనిని చూడుము”.

సంజయుఁడు ధృతరాష్ట్రునితో నిట్లు చెప్పెను :—

“ఓ రాజా! ఈవిధముగా భగవంతుఁ డర్జునునకు చెప్పి తన యద్భుతమగు రూపమును చూపించెను. దానిని వర్ణింపలేము. మనము ప్రతిదినము నొకసూర్యునే చూచుచున్నాము. కాని యీప్రకాశము వేయిసూర్యుల తేజముకంటె నధికముగ నున్నది. అతని యాభరణములు, శస్త్రములు కూడ నట్లే ప్రదీప్తములుగా నున్నవి. అతని దర్శ

నము పొంది అర్జునుని శరీరము గగుర్పాటు నొందెను. అతని తల తిరుగ సాగెను. గడగడ వణకుచు నిట్లు స్తోత్రము చేయసాగెను:—

"ఓ దేవా! విశాలమగు నీ యీ దేహమందు సర్వమును చూచు చున్నాను. బ్రహ్మ, మహేశ్వరుఁడు, ఋషులు, సర్పములు నిందుఁ గలరు. నీచేతులు ముఖములు లెక్కింప శక్యములు గావు. నీ వాది మ ధ్యాంతరహితుఁడవు. నీరూపము తేజఃపర్వతమువలె నున్నది. చూచుట తోడనే కనులు మిఱుమిట్లుగొలుపుచున్నవి. ప్రజ్వరిల్లుచున్న యగ్నివలె తళతళలాడుచు తపింపఁజేయుచున్నది. నీవే జగత్తునకాధారమవు; నీవే పురాణపురుషుఁడవు; నీవే ధర్మరక్షకుఁడవునై యున్నావు. ఎటు చూచినను నీ యవయవములే కన్పించుచున్నవి. సూర్యచంద్రులు నీ నేత్రములవలెఁ గన్పించుచున్నారు. నీవే యీ పృథ్వియందును, ఆకాశ మందును వ్యాపించియున్నావు. నీ తేజము జగత్తునంతను తపింపఁజేయు చున్నది. ఈజగత్తు గడగడవణఁకుచున్నది. దేవతలు, ఋషులు, సిద్ధులు మొదలగువారు చేతులు ముకుళించి ప్రార్థించుచున్నారు. నీ యీ విశ్వ రూపమును, ఈ తేజమును చూచి నేను వ్యాకులమును జెందితిని. శాంతి ధైర్యములను గోల్పోతిని. ఓ దేవా! ప్రసన్నుఁడవు కమ్ము. నీ కోఱలు భయంకరముగ నున్నవి. దీపముమీఁద మిడుతలు పడునట్లు మీ నోటి యందు వీరు పడుట నేఁ జూచుచున్నాను. వీరిని నీవు ముక్కలు ముక్కలుగాఁ జేయుచున్నావు. ఈ భయంకరరూపముతో నున్న నీ వెవరవో, నీ ప్రవృత్తి యేదియో నాకుఁ దెలియుటలేదు."

భగవంతుఁడు చెప్పెను:—

"లోకులను నాశనము చేయు కాలమునై యున్నాను. నీవు యుద్ధము చేసినను చేయకున్నను వీ రందఱును నశించుట నిశ్చయ మని తెలిసికొనుము. నీవు నిమిత్తమాత్రుఁడవు".



# ౧౧. విశ్వరూపదర్శనయోగము

అర్జునుఁడు చెప్పెను:—

"ఓదేవా! ఓజగన్నివాసా! నీవే అక్షరుఁడవును, సత్తువును, అసత్తువు నైయున్నావు. దీనికి పరముగ నున్నదియు నీవే. నీ వాది దేవుఁడవు, పురాణ పురుషుఁడవు. నీ వీ జగత్తున కాధారమవు, జ్ఞేయమును నీవే. వాయువవును, యముఁడవును, అగ్నివియును, ప్రజాపతివియు నీవే. నీకు వేయిసారులు నమస్కరించుచున్నాను. ఇపుడు నీ సౌమ్య రూపమును ధరింపుము"

దీనిని విని భగవంతుఁడు చెప్పెను.:—

"నీయందు ప్రసన్నుఁడనై నీకు నా విశ్వరూపమును జూపితిని. వేదాభ్యాసముచేతను, యజ్ఞముచేతను, ఇతర శాస్త్రాభ్యాసముచేతను, దానముచేతను, తపస్సుచేతను గూడ లభింపనట్టి రూపమును నీవు నేఁడు చూచితివి. దీనిని జూచి నీవు వ్యాకులపడకుము. భయము వదలి నీకు పరిచితమగు నారూపమును జూడుము. నా యీ దర్శనము దేవతలకుఁగూడ దుర్లభము. నా దర్శనము కేవలము శుద్ధమైన భక్తివలననే లభించును. ఎవరు తమ సర్వకర్మములు నా కర్పింతురో, నాయందు పరాయణులైయుందురో, నా భక్తులగుదురో, ఆసక్తిని వదలుదురో, సర్వభూతములయందును ప్రేమ గలిగియుందురో నాచే నన్నుఁ బొందుదురు".

## టిప్పణి

౧౦ వ అధ్యాయమును, ఈ పదునొకండవ అధ్యాయమును నేను బుద్ధిపూర్వకముగనే క్లుప్తపఱిచితిని. ఈ యధ్యాయము కావ్యమయము. కనుక మూలమునందుఁగాని, అనువాదమునందుఁగాని,యున్నదంతయు పూర్ణముగ ననేకపర్యాయములు చదువఁదగినది. అట్లు చేసినచో భక్తిరసము గలుగవచ్చును. ఈ రసము గలిగెనదా లేదా యని

తెలిసికొనుటకు చివరశ్లోకమునుబట్టి పరీక్షించుకొనవచ్చును. సర్వా ర్పణము చేయనిది, సర్వవ్యాపక మగు ప్రేమ లేనిది భక్తియసంభవము. ఈశ్వరునియొక్క కాలరూపమును మననము చేయుచో కాలము యొక్క నోటిలోనికి సృష్టి యంతయు పోవలసియున్న దనియు, కాలముయొక్క యీ పని ప్రతిక్షణమును జరగుచున్న దనియు తెలియుచో సర్వార్పణమును, సర్వజీవులతో నైక్యమును సహజముగనే కలుగును. ఇష్ట మున్నను లేకున్నను మనకు తెలియకయే యేక్షణముననో ఒక క్షణమున మన కీ కాలముయొక్క నోటియందు పడవలసియేయున్నది. అట్టియెడ చిన్న, పెద్ద, ఉచ్చ, నీచ, స్త్రీ, పురుష, మనుష్య, మనుష్యేతరు లను భేద మెంగుల కుండవలయును? అందఱమును, కాలేశ్వరున కొకకబళము. ఇది తెలిసికొని మనము దీనులముగను, అహంకారశూన్యులముగను ఎందులకు కాఁగూడదు? అందఱయెడల స్నేహము నేల కలిగియుండఁగూడదు? ఇట్లు చేయువాని కీకాలస్వరూపము భయంకర మైనది గాక శక్తినిలయ మగును

---

# ద్వాదశాధ్యాయము

## భక్తియోగము

ఆశ్రమమందు పాలించు వ్రతములను గూర్చియు, యజ్ఞమును గూర్చియు, యజ్ఞముయొక్క యవసరమును గురించియు మనము విచారణ చేసియుంటిమి. మన మేపుస్తకమును ప్రతిదినము కొంత పారాయణము చేయుచు పక్షముదినములలో పూర్తి చేయుచుందుమో, దేనిని మనము మననము చేయుచుందుమో, దేనిని మనము మన ఆధ్యాత్మికదీపస్తంభముగ భావించుచున్నామో, ఆగ్రంథమును నే నేవిధముగ తెలిసికొనినది యిప్పుడు విచారణ చేయఁగోరుచున్నాను. ప్రథమమున నీవిషయము నా కొక యుత్తరమువలన స్ఫురించెను. గత వారము...సోదరుని యుత్తరము వలన నే నీనిర్ణయమునకు వచ్చితిని. ఆసోదరుఁ డిట్లు వ్రాసెను. "నేను అనాసక్తియోగమును చదువుచున్నాను. దానిని తెలిసికొనుటలో చాలా కష్టము కలుగుచున్నది." వాడుకభాషలో అనాసక్తియోగమును వ్రాసినను, ప్రతిశ్లోకమునకును ప్రతిమాటకును శబ్దార్థమునుమాత్రము వ్రాయుటచే దానిని తెలిసికొనుట కష్టమే యగును. విషయమే కఠినమైనపుడు సులభభాషవలన ప్రయోజన మేమి కలుగును? కనుక నిప్పుడు విషయమునే సులభముగు భాషయందు తెలియఁబఱుపవలయు ననుకోరిక గలదు. దేని సాయమున మనము నడచుచు తిరుగుచు సర్వవ్యాపారములను చేయఁగోరుచున్నామో, దేని సాహాయ్యమువలన మనము మన యాంతరికములగు

చిక్కుల నన్నిటిని విడఁదీయుటకు ప్రయత్నించుచుందుమో ఆగ్రంథ
మును సర్వవిధముల సాధ్య మయినంతవఱకు గ్రహింపవలయును.
మాటిమాటికిని దానిని మననము చేయుచో అంతమందు తన్మయులము
కాఁగలుగుదుము. నేను నా సమస్త కష్టములలో గీతామాత యొద్దకు
పరుగెత్తుదును. నేఁటివఱకు నామె వలన శాంతిని పొందుచున్నాను.
నే నేవిధముగ గీతను గ్రహించుచున్నానో, ఆ విధానమును తెలిసికొని
నచో శాంతిని పొందఁగోరువారి కధికమగు సాహాయ్యము కలుగును.
దీనివలన వారు మఱికొన్ని క్రొత్తవిషయములు గ్రహింపవచ్చును.

నేఁడు పండ్రెండవ యధ్యాయము యొక్క సారాంశమును
వ్రాయఁగోరుచున్నాను. ఇది భక్తియోగము. వివాహసమయమందు
దీనిని పంచయజ్ఞములలో నొకటిగా కంఠస్థము చేసి మననము చేయ
వలయు నని దంపతులకు చెప్పుదుము. భక్తి లేనిది జ్ఞానమును, కర్మ
మును శుష్కములు, నిస్సారములు, బంధనరూపములు కూడ కాఁగ
లవు. కనుక భక్తితో గీతను మననము చేయ ప్రారంభింతుముగాక.

అర్జునుఁడు భగవాను నిట్లడిగెను:—

"సాకారమును పూజించు భక్తులు శ్రేష్ఠులా? నిరాకారమును
పూజించు భక్తులు శ్రేష్ఠులా?" ఈ ప్రశ్నకు భగవంతుఁ డిట్లు ప్రత్యుత్తర
మొసఁగెను:—"ఎవరు నా సాకారమును శ్రద్ధతో మననము చేయుదురో,
దానియందు లీన మగుదురో యట్టి శ్రద్ధాళులు నా భక్తులు. అయితే
యెవరు నిరాకార తత్త్వమును భజించెదరో, దాని నుపాసించుట కెవ
రింద్రియములను దమనము చేయుదురో, యెవ రన్నిటియందును సమ
భావ ముంచెదరో, యెవరికి ఉచ్చనీచభావములు లేవో అట్టివారు
కూడ నన్ను పొందుదురు. కనుక నీయిద్దఱిలో నెవరు శ్రేష్ఠులో
చెప్ప వీలులేదు. కాని శరీరధారికి నిరాకారమందు సంపూర్ణముగా

భక్తి గలుగుట యశక్య మని తలఁపఁబడుచున్నది. నిరాకారమన నిర్గుణము. కనుక నది మనుష్యుని కల్పన కతీత మయినది. కాన దేహధారు లందఱును తెలిసియో, తెలియకయో సాకారమును భజించువారే. కనుక నీవు నా సాకారమగు విశ్వరూపమందే మన స్సుంచుము. అన్నియు దాని కర్పింపుము. ఇది చేయఁజాలనిచో చిత్తముయొక్క వికారము నాఁపుట కభ్యాసము చేయుము. అనఁగా యమనియమాదులను పాలించి ప్రాణాయామ-ఆసనాదుల సాహాయ్యముచే మనస్సును స్వాధీనపఱుచుకొనుము. ఇదియు చేయఁజాలనిచో కార్యము లన్నియు నా కొఱకై చేయుచున్నా ననుభావముతో చేయుము. ఇందువల్ల నీ మోహము, మమత్వము తొలఁగును. నీవు నిర్మలుఁడ వగుదువు. నీ యందు భక్తిరసము కలుగును. ఇదియు చేయఁజాలనిచో కర్మఫలమును త్యజింపుము. అనఁగా ఫలేచ్ఛను వదలుము. నీ వంతునకు వచ్చిన పనిని చేయుము. మనుష్యుఁడు ఫలితమునకు యజమానుఁడు కాఁజాలఁడు. అనేక కారణములు కూడుటచేత నే ఫలము కలుగును. కనుక నీవు నిమిత్తమాత్రుఁడవు కమ్ము. నేను జెప్పిన యీ నాలుగు విధములలో ఒక టెక్కువ దనియు, మఱొకటి తక్కువ దనియు తలంపకుము. వీనిలో నీకు రుచించినదానిని సాధింపుము. దానినుండి నీవు భక్తిరసమును గ్రోలుము. యమనియమ ప్రాణాయామ - ఆసనాది మార్గములకంటె శ్రవణ, భజనాది జ్ఞానమార్గము సరళముగా కన్పించును. దీనికంటె ఉపాసనారూప మగు ధ్యానము సుకరముగాను, ధ్యానముకంటెను కర్మఫలత్యాగము సుకరముగాను కనుపించును. అందఱకు నొకటేమార్గము సమానముగా సులభ మైనది కాదు. కొందఱ కన్ని మార్గముల ననుసరింపవలసివచ్చును. అవియన్నియు పరస్పరసంబంధము కలిగియున్నవి. ఏదోవిధముగ నీవు భక్తుఁడవు కావలయును. ఏమార్గ

మున భక్తి సిద్ధించునో ఆ మార్గమును సాధింపుము. భక్తుఁ డన నెవఁడో యదియును నీకు చెప్పుచున్నాను. భక్తుఁ డెవనినీ ద్వేషింపఁడు. ఎవని యెడలను వైరభావము కలిగియుండఁడు. సర్వభూతములయందును స్నేహము కలిగియుండును. సర్వజీవులయెడలను కరుణ గలిగియుండుట కభ్యాసము చేయును. మమకారమును త్యజించును. అహంకారమును పూర్తిగా వదలును. సుఖదుఃఖములను సమానముగా నెంచును. తన దోషములను జగత్తు క్షమింపవలయు నని కోరును గాన ద్వేషించిన వానిని క్షమించును. సంతోషిగా నుండును. తనశుభనిశ్చయమునుండి చలింపఁడు. మనోబుద్ధులసయితముగ సర్వస్వమును నా కర్పించును. అతనివలన లోకులు మనోవేదనను పొందరు. వారు భయపడరు. అతఁడును లోకులవలన దుఃఖమును, భయమును పొందఁడు. నా భక్తుఁడు హర్ష, శోక, భయాదుల నుండి విముక్తుఁ డగును. అతని కేవిధమగు కోరికయు నుండదు. అతఁడు పవిత్రుఁడు. కుశలముగా నుండును. అతఁడు గొప్పగొప్పభోగములను త్యజించును. దృఢనిశ్చయము కలిగి యుండియు, శుభాశుభపరిణామములను త్యజించును. అనఁగా వాని విషయమున నిశ్చింతగా నుండును. అతనికి శత్రువు గాని, మిత్రుఁడు గాని యుండఁడు. అతనికి మానావమానములు సమానములు. అతఁడు లభించినదానితో తృప్తిని బొంది మౌనముగా నుండును. ఏకాకివలె సంచరించును. సర్వావస్థలయందును స్థిరుఁడుగా నుండును. ఈ విధముగా నెవరు శ్రద్ధావంతులై ప్రవర్తించెదరో వారే నా ప్రియభక్తులు.

---

13

# త్రయోదశాధ్యాయము

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగము

భగవానుఁడు చెప్పెను:—

ఈ శరీరమునకు మఱియొక పేరు క్షేత్రము. దీనిని తెలిసి కొనువాఁడు క్షేత్రజ్ఞుఁడు. అన్నిశరీరములలో నుండు నన్ను క్షేత్రజ్ఞుఁడని తెలిసికొనుము. దేనివలన క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క భేదము తెలియ నగునో అదియే నిజమైన జ్ఞానము. పంచమహాభూతములు—పృథ్వి, నీరు, ఆకాశము, తేజము, వాయువు—అహంకారము, బుద్ధి, ప్రకృతి, పది యింద్రియములు—కర్మేంద్రియములు ఐదు, జ్ఞానేంద్రియములు ఐదు—మనస్సు ఒకటి, విషయములు ఐదు, ఇచ్ఛ, ద్వేషము, సుఖదుఃఖములు, సంఘాతము అనఁగా ఏ తత్త్వమువలన శరీరము నిర్మాణ మైనదో వాని నొకటిగా నుంచుశక్తి, చేతనాశక్తి-శరీరముయొక్క పరమాణువులను పరస్పరము కలిపి యుంచునట్టి గుణము—ఇవన్నియు కలసి సవికారమైన క్షేత్రము నిర్మాణ మగుచున్నది. ఈ శరీరమును దీని వికారములను తెలిసికొనుము. ఏల యన వికారములను త్యజింపవలెను. ఈ త్యాగమునకు జ్ఞాన మావశ్యకము. అమానిత్వము (అభిమానము లేకుండుట), దంభము లేకుండుట, అహింస, క్షమ, సరళత్వము, గురుసేవ, శుచిత్వము, స్థైర్యము, మనోనిగ్రహము, విషయములయందు విరక్తి, అహంభావము లేకుండుట, జన్మము, మృత్యువు, జర, వ్యాధి, దుఃఖము మున్నగు నిత్యము కలుగు దోషములయొక్క పూర్ణజ్ఞానము కలిగియుం

డుట, దారపుత్త్రాదులు, ఇల్లువాకిలి బంధువులు మొదలగువానివలన నుండి మనస్సును తొలఁగింపవలయును. మమత్వమును వదలవలయును. నీ కిష్ట మైన విషయమందును, అనిష్ట మైన విషయమందును సమత్వము కలిగియుండవలయును. ఈశ్వరునియం దనన్యభక్తి, ఏకాంత సేవయు, లౌకికులతోఁ గలసి భోగము లనుభవించుటయం దరుచియు, ఆత్మ విషయమందు జ్ఞానపిపాసయు, చివరకు ఆత్మసాక్షాత్కారము, ఇవన్నియు జ్ఞాన మని చెప్పఁబడుచున్నవి. దీనికి వ్యతిరేక మైనది యజ్ఞానము. ఈ జ్ఞానమును పొంది దేనిని తెలిసికొనవలయునో, దేనిని తెలిసికొనిన మోక్షము లభించునో దానిని గుఱించియే కొంచెము వినుము. అజ్ఞేయ మనాది యగు పరబ్రహ్మము. దానికి జన్మము లేదు గాన యది అనాది యైనది. సర్వము శూన్యముగా నుండినపుడు కూడ పరబ్రహ్మ ముండెను; అది సత్తు గాదు, అసత్తు గాదు. అది వీని కతీత మైనది. ఒకవిధముగా దానిని సత్తని చెప్పవచ్చును. ఏల యన అది నిత్యమైనది. అయినప్పటికిని దాని నిత్యత్వమును మనుష్యుఁడు గుర్తింపఁజాలఁడు గాన అది సత్తున కతీత మైన దని చెప్పవచ్చును. అది లేని దేదియు లేదు. దానికి వేయిచేతులు, వేయికాళ్లు గల వని చెప్పవచ్చును. కాళ్లు చేతులు గలదిగాఁ గన్పించుచున్నను దాని కింద్రియములు లేవు; ఇంద్రియావశ్యకము గూడ లేదు. కనుక నది వానివలన నుండి నిర్లిప్తముగ నుండును. నేఁ డింద్రియము లున్నవి రేపుండవు. పరబ్రహ్మము నిత్యమయినది. అన్నిటియందును వ్యాపించి, సర్వభూతములను ధరించుచున్నది గాన దానిని సగుణ మని చెప్పవచ్చును. అయినను అది నిర్గుణ మైనది. గుణ మన వికారము. పరబ్రహ్మము ప్రాణులకు వెలుపల నుండు నని చెప్పవచ్చును. ఎందు కన ఎవరు దానిని గుర్తింపలేరో వారి కది వెలుపల నుండును. ప్రాణులలోపల

నుండియేయున్నది. ఏల యన అది సర్వవ్యాప్త మయినది. ఈవిధము గనే అది గమనము గలిగినదియు, స్థిరమైనదియు నైయున్నది. సూక్ష్మ మైనది గాన తెలిసికొన వీలులేదు. దూరమం దున్నది. దగ్గఱ నున్నది. నామరూప రహిత మయినను అది యుండియే యున్నది. ఈవిధముగా పరబ్రహ్మ మవిభక్త మయినది. కాని యది అసంఖ్యాకములగు ప్రాణు లయం దున్నది. విభక్తరూపమునఁగూడ భాసిల్లుచున్నది. అది సృజించుచున్నది, సంహారమును జేయుచున్నది, పాలించుచున్నది. ప్రకాశముల కెల్ల ప్రకాశ మైనది. అంధకారమునకు పరముగానున్నది. ఇట్లు తెలిసికొనుటయే పరిపూర్ణ జ్ఞానము. వీనియన్నిటి యందును పరబ్రహ్మమే తెలిసికొనఁదగినది. అదియే జ్ఞేయము. దానిని పొందుటకే జ్ఞానమును సంపాదింపవలయును.

ప్రభువు, అతని మాయ అనాదినుండి యున్నవి. మాయనుండి వికారములు పుట్టును. దానినుండి యనేకకర్మము లుత్పన్నము లగుచున్నవి. మాయవలననే జీవుఁడు సుఖదుఃఖములను, పాపపుణ్యములను, అనుభవించుచున్నాఁడు. ఇది తెలిసికొని యెవఁడు నిర్లిప్తుఁడుగానుండి కర్తవ్యకర్మమును చేయునో వాఁడు కర్మము చేయుచుండినను పునర్జన్మమును బొందఁడు. ఏల యన వాఁడు సర్వత్ర ఈశ్వరునే చూచును. అతనిప్రేరణ లేనిది యొకయాకైనను కదలదు. ఇది తెలిసికొని యతఁడు తనయం దహంభావ ముంచుకొనఁడు. తాను శరీరమునకు భిన్నుఁడ నని తెలిసికొనును. ఆకాశము సర్వత్ర వ్యాపించియున్నను ఎట్లు నిర్లిప్తముగా నుండునో, జీవుఁడు శరీరమం దుండియు జ్ఞానమువలన నిస్సంగుఁడుగా నుండును."

---

౨౨ శ్రీ [illegible]




# చతుర్దశాధ్యాయము

---

## గుణత్రయ విభాగ యోగము

శ్రీభగవంతుఁ డిట్లు చెప్పెను:—

ఏ యుత్తమ జ్ఞానమును పొంది మునులు సిద్ధిని బడసిరో దానిని మరల నీకు నేను జెప్పుచున్నాను:—జ్ఞానమును బొంది తదనుసారముగ ధర్మాచరణ మొనరించిన జనులు, జననమరణ చక్రముననుండి తప్పించుకొందురు, విముక్తిని పొందుదురు. ఓ అర్జునుఁడా! సర్వజీవులకు నేను తల్లిని తండ్రి నని తెలిసికొనుము. ప్రకృతి జన్యములగు త్రిగుణములు, సత్త్వరజస్తమోగుణములు దేహిని బంధించునవి. ఈ గుణములను క్రమప్రకారము, ఉత్తమ, మధ్యమ, కనిష్ఠము లని చెప్పవచ్చును. వీనిలో సత్త్వగుణము నిర్మల మైనదియు, నిర్దోష మైనదియు, ప్రకాశము నిచ్చునదియునై యున్నది. కాన దాని సహవాసము సుఖమును కలుగఁజేయును. రజోగుణము రాగము- తృష్ణలవలన పుట్టుచున్నది. కనుక అది మనుష్యుని మోహమునందు పడవేయును. తమోగుణ మూల మజ్ఞానము, మోహము. దానివలన మనుష్యుఁడు ప్రమాదావస్థను, అలసత్వమును పొందును. సత్త్వమువలన సుఖమును, రజస్సువలన ఆసక్తియును, తమస్సువలన అలసత్వమును కలుగును. రజస్సును తమస్సును అణఁచి సత్త్వము విజయమును పొందును. దేహముయొక్క అన్ని వ్యాపారములలో జ్ఞానానుభవము కలిగినప్పుడు వానియందు సత్త్వగుణము ప్రధానముగా నుండి పని చేయుచున్న దని తెలిసికొన

వలయును. ఎక్కడ లోభము, ఆసక్తి, అశాంతి, స్పర్ధ గలవో అక్కడ రజోగుణము ప్రధాన మైన దని తెలిసికొనవలయును. ఎక్కడ అజ్ఞానము, సోమరితనము, మోహానుభవము గలవో అక్కడ తమోగుణము రాజ్యము చేయుచున్న దని తెలిసికొనవలయును. ఎవని జీవితమునందు సత్త్వ గుణము ప్రధానముగా నుండునో వాఁడు చనిపోయిన పిదప జ్ఞానమయమగు నిర్దోషలోకమందు జన్మించును. రజస్సు ప్రధాన మైనయెడల మనుష్యలోకమును పొందును. మఱియు తమస్సు ప్రధాన మైనచో మూఢయోనియందు జన్మించును. సాత్త్వికుల కర్మఫలము నిర్మల మైనది. రాజసుల కర్మఫలము దుఃఖమయ మైనదియు, తామసుల కర్మఫల మజ్ఞానపూర్ణ మైనదియు నగును. సాత్త్వికుల లోకముయొక్క గతి యున్నత మైనది. రాజసుల గతి మధ్యమము. తామసుల గతి అధమము నగును. గుణములు తప్ప వేఱుగా కర్త లేఁడనియు, గుణముల కతీతుఁడను నే నున్నా ననియు, మనుష్యుఁడు గ్రహించినపుడు వాఁడు నా భావమును పొందును. ఎవఁడు దేహమందున్న ఈత్రిగుణములను దాఁటి పోవునో వాఁడు జన్మ జరా మృత్యు దుఃఖములను దాఁటి అమృతమయమగు మోక్షమును పొందును."

దీనిమీఁదట అర్జునుఁ డిట్లడిగినాఁడు :—

"గుణాతీతుని స్థితి యిటువంటి సుందర మైన దనుచో వాని లక్షణము లేవి? వాని యాచరణ మెట్లుండును? వాఁడు త్రిగుణాతీతుఁడెట్లు కాఁగలఁడు?"

భగవానుఁ డిట్లు ప్రత్యుత్తర మొసఁగినాఁడు :—మనుష్యుఁడు తన కేది సంభవించినను, ప్రకాశము గాని, ప్రవృత్తి గాని లేక మోహము గాని—జ్ఞానము గాని ఆసక్తి గాని లేక అజ్ఞానము గాని—

వానికై సుఖదుఃఖములను పొందఁగూడదు. ఎవఁడు కోరికలను కోరఁడో, గుణముల విషయమున తటస్థుఁడుగా నుండి చలింపఁడో, ఎవఁడు గుణములు తమతమ కార్యములు చేయుచుండు నని తలఁచి స్థిరముగా నుండునో, ఎవఁడు సుఖదుఃఖములను సమానముగా గ్రహించునో, ఎవనికి ఇనుము, రాయి, బంగారము సమానములో; ఎవనికి ప్రియము అప్రియము లేదో, ఎవనికి నిందాస్తుతులు సమానములో; మానావమానముల నెవఁడు సమానముగా చూచునో, ఎవఁడు శత్రుమిత్రులయెడల సమభావము కలిగియుండునో, ఎవఁడు సర్వారంభములను పరిత్యజించునో, వాఁడు గుణాతీతుఁ డని చెప్పఁబడును. ఈ లక్షణములను వినిచకితుఁడవు కావలదు. సోమరివై చేతులు ముడుచుకొని కూర్చుండ నవసరము లేదు. నేను సిద్ధుని దశ వర్ణించితిని. ఆ దశను పొందుటకు మార్గ మిది—వ్యభిచార రహితమగు భక్తియోగముచే నన్ను సేవింపుము. మూఁడవ అధ్యాయము ప్రారంభముననుండియు, కర్మము లేనిది, ప్రవృత్తి లేనిది. ఎవఁడును, ఊపిరిని గూడ పీల్చఁజాలఁ డని నేను నీకు చెప్పియుంటిని. కనుక కర్మము, దేహి ననుసరించి యుండియే యున్నది. ఏ సాధకుఁడు త్రిగుణాతీతుఁడు కావలయు నని కోరునో వాఁడు సర్వకర్మములను నా కర్పింపవలయును. ఫలేచ్ఛ నేమాత్రము నుంచుకొనఁ గూడదు. ఇట్లు చేయుచో అతనికర్మము లతనికి బంధనములు కావు. ఎందుల కన బ్రహ్మము నేను. మోక్షము నేను. అనంతసుఖము నేను. సర్వమును నేనే. మనుష్యుఁ డహంకారశూన్యుఁ డగుచో సర్వత్ర నన్నే చూచును. అప్పుడు త్రిగుణాతీతుఁ డగును."

---

# పంచదశాధ్యాయము

## పురుషోత్తమయోగము

"ఈసంసారము (ప్రపంచము) రెండు విధములుగ కనఁబడును. ఈ సంసారవృక్షమున కొకరూప మే మన, మొదలు పైకుండి శాఖలు క్రింది కుండును. వేదములు దానికి ఆకులు. సంసారము నిట్టి రావి చెట్టురూపముగా చూచువాఁడు వేదముల నెఱింగిన జ్ఞాని యగును. రెండవ విధ మిది-సంసార మను వృక్షముయొక్క కొమ్మలు క్రిందను పైన వ్యాపించి యున్నవి. దానియందు త్రిగుణములతో వృద్ధినొందిన విషయము లను అంకురములు గలవు. ఆ విషయములు జీవుని మనుష్య లోకమందు కర్మబంధమున బంధించును. ఈవృక్షస్వరూపమును తెలిసి కొనఁజాలము. దాని కాదియు, నంతమును, ఆధారస్థానమును, లేవు. ఇదియే రెండవవిధమగు సంసారవృక్షము. ఈ వృక్షముయొక్క వేళ్లు లోఁతునకు పాతుకొనిపోయినను దీనిని అసహయోగ మను శస్త్రముచే నఱికివేయవలయును. ఇందువలన ఆత్మ మరల తిరిగి రావలసిన యవ సరము లేని లోకమునకు పోవును. ఈ పదవిని పొందుటకీపురాతనమగు ప్రవృత్తి యెవని మాయవలన వ్యాపించియున్నదో ఆ యాదిపురుషుని నిరంతరము భజింపవలయును. ఎవ రభిమానమును, మోహమును త్యజిం చిరో, ఆసక్తిదోషమును జయించిరో, ఎవ రాత్మయందు లీనమై యుందురో, ఎవరు విషయములను జయించిరో, ఎవరికి సుఖదుఃఖ ములు సమానములో అట్టి జ్ఞాను లవ్యయపదమును పొందుదురు. ఆస్థల

మున సూర్యునకుఁ గాని, చంద్రునకుఁ గాని, అగ్నికిఁ గాని ప్రకాశము కలుగఁజేయ నవసరము లేదు. అచటికి వెళ్ళినపిదప తిరిగి రా నవసర ముండదు. అది నా శ్రేష్ఠమైన స్థానము.

ఈ జీవజగత్తునందు నా సనాతనాంశమగు జీవుఁడు ప్రకృతిలో నున్న మనస్సును, అయిదింద్రియములను ఆకర్షించుచుండును. జీవుఁడు దేహధారణము చేసినపుడును, శరీరమును విడిచినపుడును వాయు వెట్లు తనవెంట గంధమును తీసికొని సంచారము చేయుచుండునో అట్లే యీ జీవుఁడును ఇంద్రియములను వెంటఁబెట్టుకొని సంచారము చేయు చుండును. చెవి, కన్ను, చర్మము, నాలుక, ముక్కు, మనస్సు వీని సాహాయ్యమున జీవుఁడు విషయములను భోగించును. మోహమందు పడియున్న అజ్ఞాని గుణముల సాహాయ్యమున వెడలిపోవు నదియు, స్థిరముగా నుండునదియు, భోగముల ననుభవించునదియునగు ఈశ్వ రాంశమగు జీవుని తెలిసికోనఁజాలఁడు. జ్ఞాని దానిని తెలిసికొనును. ప్రయత్నశీలు రగు యోగులు తమ యందుండు నీజీవుని తెలిసికొనుచు న్నారు. కాని యెవరు సమభావమును, యోగసిద్ధిని బడయలేరో, వారు ప్రయత్నించినను దానిని తెలిసికోనఁజాలరు. సూర్యునియొక్క యే తేజస్సు, జగత్తును ప్రకాశింపఁజేయుచున్నదో, చంద్రునియందును, అగ్నియందును ఏ తేజము గలదో యది యంతయు నా తేజ మని తెలిసి కొనుము. నా శక్తివలన శరీరములో ప్రవేశించి నేను జీవులను ధారణ చేయుచున్నాను. రసము నుత్పత్తి చేయు సోమరసమనై సర్వౌష ధములను పోషించుచున్నాను. ప్రాణులదేహమం దుండి నేను జఠ రాగ్ని నగుచున్నాను. ప్రాణాపానవాయువులను సమానముగఁ జేసి నాలుగు విధములగు అన్నములను జీర్ణము చేయుచున్నాను. అందఱి హృదయములలోను నే నుందును. నా వలననే స్మృతి, జ్ఞానము, వాని

యభావము కలుగుచున్నవి. అన్నివేదములవలనను తెలిసికొనఁదగిన వాఁడను నేనే. వేదాంతమునుగూడ నేనే. వేదముల నెఱుఁగువాఁడను నేనే. ఈ లోకమందు క్షరుఁడనియు, అక్షరుఁడనియు నిరువురు పురుషులు గలరు. అనఁగా నాశన మగువాఁడు, నాశన రహితుఁడు. సర్వభూతములు క్షరములు. వానియందుండు నేను అక్షరుఁడను. వీనికి పరమందు ఉత్తమపురుషుఁడు గలఁడు. అతఁడు పరమాత్మఁ డని చెప్పఁబడును. అవ్యయుఁడగు నీయీశ్వరుఁడు మూఁడులోకములందు ప్రవేశించి వానిని పోషించుచున్నాఁడు. ఆ యీశ్వరుఁడను నేనే. కనుక నేను క్షరునికంటెను, అక్షరునికంటెను ఉత్తముఁడను. లోకములయందును, వేదములయందును నేను పురుషోత్తమరూపముతో ప్రసిద్ధుఁడనై యున్నాను. ఈ విధముగా నేజ్ఞాని నన్ను పురుషోత్తమరూపమున గుర్తించునో, వాఁడు సర్వము నెఱింగినవాఁడగును. అన్ని భావములతో నన్నే భజించును. పాపరహితుఁడ వగు ఓ అర్జునుఁడా! అతిరహస్యమగు నీ శాస్త్రమును నేను నీకు బోధించితిని. దీనిని తెలిసికొని మనుష్యుఁడు బుద్ధిమంతుఁడై తనధ్యేయమును చేరును."

---

## ౧౬

# షోడశాధ్యాయము

---

## దైవాసుర సంపద్విభాగ యోగము

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పినాఁడు :—

"ఇప్పుడు నేను నీకు ధర్మ వృత్తికిని, అధర్మ వృత్తికిని (దైవీ సంపత్తునకు, అసురసంపత్తునకు గల భేదమును చెప్పుచున్నాను. ధర్మ వృత్తివిషయమున ప్రథమమున చాలఁ జెప్పియుంటిని. అయినను మరల దాని లక్షణములు చెప్పుచున్నాను. ధర్మవృత్తి గలవానియందు నిర్భయత్వము, అంతఃకరణశుద్ధి, జ్ఞానము, సమత్వము, ఇంద్రియనిగ్రహము, దానము, యజ్ఞము, శాస్త్రాభ్యాసము, తపస్సు, సరళత్వము, అహింస, సత్యము, క్రోధము లేకుండుట, త్యాగము, శాంతి, ఎవరిపైనను చాడీలు చెప్పకుండుట, అపైశున్యము, సర్వభూతములయందును దయ, అలోలుపత్వము, కోమలత్వము, మర్యాద, అచంచలత్వము, తేజము, క్షమ, ధైర్యము, బాహ్యాంతరములందు శుచిత్వము, ద్రోహము లేకుండుట, నిరభిమానము ఉండును. అధర్మవృత్తి గలవానియందు దంభము, దర్పము, అభిమానము, క్రోధము, కాఠిన్యము, అజ్ఞానము ఉండును. ధర్మవృత్తి మానవుని మోక్షము వైపునకు తీసికొనిపోవును. అధర్మవృత్తి వానిని బంధనమునందుఁ బడవేయును. ఓ అర్జునుఁడా! నీవు ధర్మవృత్తితో జన్మించినావు. అధర్మవృత్తిని గుఱించి కొంత విస్తరించి చెప్పెదను. దీనిని జనులు సహజముగనే వదలవలయును. అధర్మవృత్తి గలవానికి ప్రవృత్తి నివృత్తుల భేదము

తెలియదు. వానికి శుద్ధము, అశుద్ధము, సత్యము, అహింస జ్ఞాన ముం డదు. ఆతని యాచారముల కంత ముండదు. ఆతఁడు జగత్తు అసత్య మనియు, నిరాధార మనియు, ఈ జగత్తున కెవ్వఁడును నియంత లేఁ డనియు, స్త్రీ పురుషుల సంబంధమే ప్రపంచ మనియు తలఁచును. అనఁగా వానికి విషయభోగములు తప్ప మఱియొక యాలోచన యుండదు. ఇట్టి వృత్తిగలవాని పనులు భయంకరములుగ నుండును. వాని బుద్ధి మందగించును. అట్టివారు తమ దుష్టభావములనే యుంచు కొందురు. వారి ప్రవృత్తి యంతయు, జగత్తును నాశనము చేయు టకే ప్రయోగించును. వారికోరికల కంత ముండదు. వారు దంభ, మాన, మద నిమగ్నులై యుందురు. ఈ కారణముచే వారి చింతకుఁ గూడ నంత ముండదు. వారికి నిత్యము క్రొత్త క్రొత్త భోగములు కావలసియుండును. వారు వందల కొలఁది యాశాసౌధములు నిర్మిం చుచుందురు. తమ కోర్కెలను నెఱవేర్చుకొనుటకు ధన మార్జించుట యందు న్యాయాన్యాయములను విచారింపరు. 'నేఁ డిది లభించినది, రేపు మఱొక దానిని సంపాదింతును, నేఁ డీ శత్రువును చంపితిని. రే పితరులను చంపెదను. నేను బలవంతుఁడను, నాయొద్ద బుద్ధి సిద్ధులు గలవు. నాతో సమానుఁడైనవాఁ డెవఁడున్నాఁడు? కీర్తిని సం పాదించుటకు యజ్ఞమును చేయుదును. దాన మిచ్చెదను. ఆనంద మనుభవించెదను.' ఈ విధముగా వారు మనస్సునఁ దలపోయుచు సంతో షించుచుందురు. చివరకు మోహజాలమున చిక్కుపడి నరకము నను భవించెదరు. అసురవృత్తిగలవా రిట్లు గర్వపడుచు పరనిందఁ జేయుచు సర్వవ్యాపకుఁ డగు నీశ్వరుని ద్వేషించుచుందురు. ఈ కారణ ముచే మాటిమాటికిని వారు అసురయోనియందు జన్మించుచుందురు. ఆత్మను నాశనము చేయు నీ నరకమునకు మూఁడు ద్వారములు గలవు.

అవి కామము, క్రోధము, లోభము. అందఱు నీమూఁడింటిని త్యజింప వలయును. వీనిని త్యజించువారు కల్యాణమార్గమున నడచువా రగుదురు. మఱియు వారు పరమగతిని పొందుదురు. ఎవరు అనాది సిద్ధాంతమైన శాస్త్రమును త్యజించి స్వేచ్ఛగా భోగములయందు నిమగ్నులై యుందురో వారు సుఖమును బొందఁజాలరు. కల్యాణ మార్గముయొక్క శాంతిని పొందఁజాలరు. కనుక కార్యాకార్యములను నిర్ణయించుటయం దనుభవజ్ఞులవలన అచంచలమైన సిద్ధాంతములను దెలిసికొనవలయును. మఱియు తదనుసారముగ నాచరింప వలయును."

---

# సప్తదశాధ్యాయము

## శ్రద్ధాత్రయ విభాగయోగము

అర్జునుఁ డిట్లు ప్రశ్నించినాఁడు:—

"శిష్టాచారమును వదలి శ్రద్ధాపూర్వకముగ సేవఁ జేయువాని గతి యే మగును?"

శ్రీభగవానుఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చినాడు:—

"శ్రద్ధ సాత్త్వికము, రాజసము, తామసము అని మూఁడువిధము లుగ నుండును. ఎవని కేవిధమగు శ్రద్ధ యుండునో వాఁ డావిధముగ నగును. సాత్త్వికులు దేవతలను, రాజసులు యక్షరాక్షసులను, తామసులు భూతప్రేతములను భజింతురు. కాని యెవని శ్రద్ధ యెట్టిదో యతి శీఘ్రముగ తెలియదు. ఇందుకై, యతని యాహార మేమి? అతనితప మెట్టిది? యజ్ఞ మెట్టిది? అని తెలిసికొనవలయును. ఇవి యన్నియుఁ గూడ మూఁడువిధములుగ నున్నవి. వానినిగూడఁ జెప్పుచున్నాను. ఏయాహారమువలన నాయువు, నిర్మలత్వము, బలము, ఆరోగ్యము, సుఖము, రుచి, వృద్ధి యగునో యది సాత్త్వికాహారము. కారముగను, పులుపుగను, చేదుగను, వేఁడిగ నుండునాహారము రాజసమైనది. దాని వలన దుఃఖములు, రోగములు గలుగుచున్నవి. చలిది, దుర్గంధము గలది, ఉచ్ఛిష్టమైనది, అపవిత్ర మైనది తామసాహార మని తెలిసికొనవల యును. ఏయజ్ఞము ఫలేచ్ఛ లేక, కర్తవ్యరూపముగ తన్మయత్వ

ముతో చేయఁబడునో యది సాత్త్వికయజ్ఞము. దేనియందు ఫలాపేక్ష, దంభములు గలవో దానిని రాజసయజ్ఞ మని తెలిసికొనుము. దేనియందు శాస్త్రవిధి, అన్నోత్పత్తి, మంత్రము, త్యాగములు లేవో యది తామసయజ్ఞము. దేనియందు సాధుపూజయు, పవిత్రతయు, బ్రహ్మచర్యము, అహింసయుఁ గలవో యది శారీరక తప స్సనఁబడును. సత్యము, ప్రియము, హితకరము నగుమాట లాడుట, ధర్మగ్రంథాభ్యాసము వాచికతప స్సగును. మనఃప్రసన్నత, సౌమ్యము, మౌనము, సంయమము, శుద్ధభావన యివి మానసిక తప స్సగును. ఎవఁడు సమభావముతో ఫలాపేక్షను వదలి యీవిధముగ శారీరక, వాచిక, మానసిక తపస్సును చేయునో వాని తపస్సు సాత్త్విక మైన దని చెప్పఁబడును. ఏ తపస్సు గౌరవము నపేక్షించి దంభపూర్వకముగ చేయఁబడునో దానిని రాజస తప మని తెలిసికొనుము. ఏ తపస్సు బాధవలనను దురాగ్రహమువలన నితరుల నాశనముకొఱకు చేయఁబడునో, దేనివలన శరీరమం దుండు నాత్మకు నిరర్థకమగు క్లేశము సంభవించునో యా తపము తామస మైనది. ఫలాపేక్షను వదలి దేశకాలపాత్రములను జూచి కర్తవ్య మను తలంపుతో చేయు దానము సాత్త్విక మైనది. ఏ దానమున ప్రతిఫలాపేక్ష కలదో, సంకోచము కలదో ఆ దానము రాజస మైనది. దేశకాలములు మొదలగువానిని విచారింపక తిరస్కారముతో సమానము లేకుండ నియ్యఁబడుదానము తామస మైనది.

వేదములు బ్రహ్మమును 'ఓం తత్సత్' అని వర్ణించినవి. కనుక శ్రద్ధావంతులు యజ్ఞము దానము తపము మొదలగు క్రియ లీమంత్రోచ్చారణతో చేయుదురు. 'ఓం' అనఁగా ఏకాక్షర బ్రహ్మము. 'తత్' అనఁగా అది. సత్ అనఁగా కల్యాణరూపము. ఈశ్వరుఁ డొక్కఁడు

అతఁడే యున్నాఁడు. అతఁడే సత్యము. అతఁడే కల్యాణము నిచ్చు
వాఁడు. ఎవఁ డీవిధమగు భావము కలిగి ఈశ్వరార్పణబుద్ధితో యజ్ఞా
దులు చేయునో వాని శ్రద్ధ సాత్త్విక మైనది. అతఁడు శిష్టాచారము
నెఱిఁగియున్నను లేకున్నను ఈశ్వరార్పణబుద్ధితో చేయును. శిష్టాచా
రమునకు భిన్నముగఁ జేసినను వాఁడు దోషరహితుఁ డగును. కాని
ఏ కర్మము లీశ్వరార్పణబుద్ధితో చేయఁబడవో యవి శ్రద్ధాశూన్యము
లని యెంచఁబడును. కాఁబట్టి యవి యసత్తు లగుచున్నవి.”

---

79

# అష్టాదశాధ్యాయము

---

## మోక్షసన్న్యాస యోగము

పదునేడవయధ్యాయము మననము చేసిన పిమ్మట అర్జునుని మనస్సునం దింకను సందేహ ముండెను. ఏల యన గీతయందుఁ జెప్పఁబడిన సన్న్యాసము, ఆచరణమందున్న సన్న్యాసముకంటె భిన్నముగా గోచరించెను. త్యాగము, సన్న్యాసము రెండును భిన్నములా యను సందేహము గలిగెను. ఈ శంకానివారణముకొఱకు భగవంతుఁడీ కడపటి యధ్యాయమందు గీతోపదేశమును మరలఁ జేయుచున్నాఁడు. కర్మములు మూఁడువిధములు. కొన్ని కర్మములు కామముతోఁగూడినవై యుండును. అనేకవిధములగు కోరికలను నెఱవేర్చుకొనుటకు జనులు ప్రయత్నింతురు. ఇవి కామ్యకర్మములు. మఱికొన్ని యవసరమైనవి, స్వాభావికములైన కర్మములు గలవు. ఊపిరి పీల్చుట, చూచుట, దేహపోషణమున కవసరమైనంత భుజించుట, ధరించుట, నిద్రించుట, కూర్చుండుట మొదలగునవి. మూఁడవ విధమైనవి, పారమార్థిక కర్మములు. వీనిలో కామ్యకర్మములను త్యజించుటయే గీతయందుఁ జెప్పఁబడిన సన్న్యాసము. సర్వకర్మఫలములను త్యజించుట గీతామాన్యమగు త్యాగము. ప్రతి కర్మమందును కొంత దోష మున్న దని చెప్పవచ్చును. అయినను యజ్ఞార్థము అనఁగా పరోపకారార్థము చేయఁబడు కర్మములను త్యజింపఁగూడదు. యజ్ఞమందు జ్ఞానము, తపస్సు ఇమిడియున్నవి. కాని పరమార్థము

కొఱకు చేయు కర్మములయందుఁ గూడ ఆసక్తి, మోహము ఉండఁ గూడదు. ఆసక్తి యున్నచో వానియందు దోషము ప్రవేశింప వచ్చును. మోహవశమున నియతకర్మమును త్యజించుట తామస కార్య మగును. దేహమునకు కష్టము గలుగు నని తలఁచి చేయు త్యాగము రాజస త్యాగము. "ఫలేచ్ఛ నుంచుకొనక చేయావలయును." అను భావముతో నే సేవాకార్యము చేయఁబడునో యదియే వాస్తవమగు సాత్త్వికత్యాగము. ఈత్యాగమందు కర్మములను త్యజింపఁగూడదు. కాని కర్తవ్యకర్మఫలమును త్యజింపవలయును. అనఁగా కామ్యకర్మములను త్యాగము చేయవలసియే యుండును. అట్టి త్యాగిహృదయమందు సందేహ ముండనేరదు. అతనిభావము పరిశుద్ధ మగును. వాఁడు తన సదుపాయములను, ఇబ్బందులను విచారింపఁడు. కర్మఫలమును త్యజింపని వారు మంచివి, చెడ్డవి యను ఫలితముల ననుభవింపవలసియే యుందురు. ఈ కారణముచే వారు బంధనమునం దుందురు. ఎవఁడు ఫలత్యాగము చేయునో వాఁడు బంధముక్తుఁ డగును. అతనికి కర్మమం దాసక్తి యుండదు. "నేను చేయుచున్నాను" అను అభిమానము మిథ్య. కర్మసిద్ధికై యైదు కారణములు గలవు. క్షేత్రము,కర్త,సాధనము, క్రియలు ఇవియన్నియు నుండినను అంతమున దైవము గలదు. ఇది తెలిసికొని మనుష్యుఁ డభిమానమును వదలవలయును. ఎవఁ డహంకారమును వదలి కర్మము చేయునో వాని విషయమున వాఁడు కర్మములు చేయుచున్నను చేయుట లే దని చెప్పవచ్చును. ఏల యన వాని నా కర్మములు బంధింపఁజాలవు. నిరభిమానుఁడు, నహంకారశూన్యుఁడు నగు నిట్టిమనుష్యుని విషయమున వాఁడు చంపుచున్నను చంపుటలే దని చెప్పవచ్చును. ఏమనుష్యుఁ డైనను అహంకారశూన్యుఁ డై కూడ హింస చేయుచు నిర్లిప్తుఁడుగ నుండవచ్చు నని దీని యర్థము గాదు.

ఏల యన నిరభిమానునికి హింస చేయుటవలన ప్రయోజన ముండదు. కర్మముయొక్క ప్రేరణయందు మూఁడు విషయములు గలవు. జ్ఞానము జ్ఞేయము, పరిజ్ఞాత; ఈవిధముగ ప్రేరణ గలిగినపిమ్మట నేకర్మములు జరగునో వాని కింద్రియములు సాధనము లగును. ఏది చేయవలయునో యది క్రియ. క్రియను జేయువాఁడు కర్త. ఈ విధముగ విచారణవలన నాచరణ మేర్పడును. లోఁతుగా నాలోచించినచో నే జ్ఞానమువలన మనము సర్వప్రాణులయందు నొకటే భావమును (తత్త్వమును) జూతుమో, మఱియు నేజ్ఞానమువలన భిన్న భిన్నముగా గోచరించు చున్నను ఏకత్వమును గుర్తించెదమో యది సాత్త్విక జ్ఞానము. దీనికి వ్యతిరేకముగ దేనివలన భిన్నత్వము గనుపించునో యది రాజస జ్ఞానము. దేనివలన సత్యాసత్యములు గోచరింపవో, కారణము లేకయే సర్వము మిశ్రమముగాఁ గనిపించునో యది తామస జ్ఞానము. జ్ఞానమును విభజించినటులే కర్మమును గూడ విభజింపవచ్చును. ఫలేచ్ఛ లేనిది యు,రాగద్వేషములు లేనిదియు నగు కర్మము సాత్త్వికమైనది.ఎక్కడ భోగేచ్ఛగలదో, నేను చేయుచున్నా నను నభిమానము గలదో, యీ కారణముచే నాసక్తి గలదో యది రాజసకర్మము. పరిణామమును గూర్చియు, హానిని గూర్చియు, హింసను గుఱించియు,శక్తిని గూర్చియు విచారణఁ జేయక యేకర్మము మోహవశముచేఁ జేయఁబడునో యది తామస కర్మము. కర్మములవలె కర్తలు గూడ మూఁడు విధములుగ నుందు రని తెలిసికొనుము. కర్మమును గుర్తించిన తర్వాత కర్తను గుర్తించుటకు కష్ట మేమాత్రమును లేదు. ఎవనికి రాగము అహంకారము లేవో, యెవనియందు దృఢత్వము, సాహసము గలవో, ఎవనికి మంచిచెడుగుల ఫలితములవలన సుఖదుఃఖములు గలుగవో వాఁడు సాత్త్వికకర్త. రాజస కర్తయందు రాగము, లోభము, హింస

సుఖదుఃఖము లుండును. వానికి కర్మఫలేచ్ఛ తప్పక యుండియే తీఱును. వ్యవస్థాహీనుఁడును, దీర్ఘసూత్రియు, మొండిపట్టు గలవాఁడును, శఠుఁడును, సోమరియును, సంక్షేపముగాఁ జెప్పిన సంస్కార విహీనుఁడును, తామస కర్త. బుద్ధి, ధృతి, సుఖములు గూడ త్రివిధములని తెలిసికొనుము. సాత్త్వికబుద్ధి ప్రవృత్తినివృత్తులు, కార్యాకార్యములు,భయాభయములు, బంధమోక్షములు మొదలగు వాని భేదము సరిగ గ్రహించును. రాజసబుద్ధి యీ భేదమును గుర్తించును గాని సాధారణముగా నపార్థమును గ్రహించును. తామసబుద్ధి ధర్మమును అధర్మ మని తెలిసికొనుచుండును. సర్వమును విపరీతముగ గ్రహించును. ధృతి యనఁగా ధారణ;సర్వపదార్థములను ఒకచోఁ జేర్చియుంచునట్టి శక్తి. ఈశక్తి కొలఁదిగనో గొప్పగనో అన్నిటియందు నున్నది. ఈశక్తి లేనిచో ప్రపంచ మొక్క క్షణ మాత్ర మైనను నిలువఁజాలదు. దేనివలన మనఃప్రాణేంద్రియ వ్యాపారములకు సామరస్యము గలుగునో, సమానత్వ ముండునో యది సాత్త్విక ధృతి. దేనివలన మనుష్యుఁడు ధర్మార్థకామముల నాసక్తిపూర్వకముగ నాచరించునో యట్టిది రాజస ధృతి యగును. ఏ ధృతి మనుష్యుని నిద్రను భయమును శోకమును నిరాశను మదమును వదలకుండఁజేయునో యది తామస ధృతి యగును. దేనియందు దుఃఖానుభవము లేదో, ఆరంభమున విషమువలె నుండినను పరిణామమున నమృతతుల్య మగునో, దేనియం దాత్మ ప్రసన్నముగ నుండునో యదియే సాత్త్వికసుఖము. విషయభోగములం దేది యారంభమున నమృతమువలె నున్నను, అంతమున విషమువలె నుండునో యది రాజససుఖము. దేనియందు మూర్ఛ, ఆలస్యము, నిద్ర మాత్రమే యుండునో యద తామస సుఖము. ఈ విధముగ ప్రతివిషయమును మూఁడు విభాగములుగఁ జేయవచ్చును. బ్రాహ్మణాది

చాతుర్వర్ణ్యము గూడ నీ త్రిగుణముల న్యూనాధికముల ననుసరించియే యేర్పడినవి. బ్రాహ్మణుని కర్మమందు శమము, దమము, తపస్సు, శౌచము, క్షమ, సరళత్వము, జ్ఞానము, వీని యనుభవము, మఱియు ఆస్తిక్యము నుండవలయును. క్షత్రియునియందు శౌర్యము, తేజము, ధృతి, దక్షత, యుద్ధమున వెనుదీయకుండుట దాతృత్వము, రాజ్యమును పాలించుశక్తి యుండవలెను. వ్యవసాయము, గోరక్షణము, వ్యాపారము ఇవి వైశ్యుని కర్మములు. సేవ శూద్రుని కర్మము. ఒకవర్ణమువారిలో నున్నగుణములు మఱియొక వర్ణము వారిలో నుండ వని కాని యీ గుణములను వృద్ధిఁ జేసికొనుట కధికారము లే దని కాని దీని యర్థము గాదు. పైఁ జెప్పిన గుణములను, కర్మములనుబట్టి యాయావర్ణములను గుర్తింపవచ్చును. కాని ప్రత్యేక వర్ణముయొక్క గుణకర్మములను గుర్తించునపుడు పరస్పరద్వేషభావముండఁగూడదు. హానికరమగు పోటీయు నుండఁగూడదు. ఇచట న్యూనాధిక భేదభావములకు స్థానము లేదు. కాని అందఱును తమ స్వభావానుసారము నిష్కామభావముతోఁ దమతమ కర్మములను జేయుచున్నచో నాయా కర్మములు చేయుచున్నందుననే మోక్షమున కధికారు లగుదురు. కనుకనే పరుల ధర్మము సరళముగాఁ గనిపించినను స్వధర్మము నిస్సారముగను, నిరుపయోగముగను కనుపించుచున్నను స్వధర్మమే శ్రేష్ఠమైన దని చెప్పఁబడెను. స్వభావజనితమగు కర్మమందు పాప ముండదు. ఏల యన దానియందు నిష్కామత సురక్షితముగ నున్నది. వేయితర విషయము నపేక్షించినను కామము కలుగును. ఏవిధముగ నగ్నియందు పొగ యున్నదో యా విధముగనే సర్వకర్మములయందును దోష మిమిడియే యున్నది. కాని సహజప్రాప్తమగు కర్మమును ఫలాపేక్ష లేకుండఁ జేయుచో కర్మముయొక్క పాపము

లంటవు. ఎవఁడీవిధముగ స్వధర్మమును పాలించుచు పరిశుద్ధుఁడగునో, యెవఁడు మనస్సును స్వాధీనమం దుంచుకొనునో, యెవఁడు ఐదువిషయములను త్యజించునో, యెవఁడు రాగద్వేషముల జయించునో, యెవఁ డేకాంతసేవిగా-అనఁగా అంతర్ధ్యానుఁడుగ-నుండఁగలడో, యెవఁడు మితాహారమును భుజించుచు మనోవాక్కాయములను వశమం దుంచుకొనునో, నిరంతరము ఈశ్వరధ్యాననిమగ్నుఁ డైయుండునో, యెవఁ డహంకారము, కామము, క్రోధము, పరిగ్రహము మున్నగువానిని త్యజించునో; శాంతియుతుఁ డగునట్టి యోగి బ్రహ్మభావమును బొందనర్హుఁడు. ఇట్టి మనుష్యుఁ డందఱియెడలను సమభావముతోఁ బ్రవర్తించును. సుఖదుఃఖములఁ బొందఁడు. ఇట్టిభక్తుఁ డీశ్వరతత్త్వమును గ్రహించును, ఈశ్వరునియందు లీనుఁ డైయుండును. ఈ విధముగా నెవ్వఁడు భగవంతు నాశ్రయించునో వాఁ డమృతపదవిని పొందును. కనుక "అన్నియు నా కర్పింపుము. నాయందు పరాయణుఁడ వైయుండుము. వివేకబుద్ధి నాశ్రయించి, చిత్తమును నాయందు నిల్పుము." అని భగవంతుఁడు చెప్పుచున్నాఁడు. ఇట్లు చేయుచో సర్వదుఃఖముల వలన విముక్తిని పొందుదువు. కాని యహంకారముచే నా మాటను విననిచో నాశనమును పొందుదువు. సారాంశ మేమన సర్వప్రపంచమును వదలి నన్నే శరణు పొందుము. నీవు పాపవిముక్తుఁడ వగుదువు. ఎవఁడు తపస్వి కాఁడో, భక్తుఁడు కాఁడో, యెవనికి వినవలెనను కోరిక లేదో, యెవఁడు నన్ను ద్వేషించుచుండునో వానికీజ్ఞానము చెప్పకుము. పరమరహస్యమగు నీజ్ఞానము నెవఁడు నా భక్తుల కుపదేశించునో వాఁడు నన్ను భజించుటవలన నన్నే తప్పక పొందును.

అంత్యమున సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పుచున్నాఁడు: ఎక్కడ యోగేశ్వరుఁడగు కృష్ణుఁ డుండునో, యెక్కడ ధనుర్ధారి

యను పార్థుఁ డుండునో అక్కడ శ్రీయును, విజయమును, వైభవమును, అచంచలమగు నీతియు నుండును. ఇచ్చట కృష్ణునికి యోగేశ్వరుఁ డని విశేషణము ప్రయోగింపఁబడినది. దీని యర్థమే మన స్పష్టమగు శుద్ధమైన యనుభవజ్ఞానము. ధనుర్ధారి యగు పార్థుఁ డన నట్టి యనుభవసిద్ధమైన జ్ఞానమననుసరించు క్రియ. విశుద్ధమగు ననుభవజ్ఞానము, తదనుసారమగు నాచరణము నుండునో పరమునకిది విరుద్ధము కాని మనోశాంతి [illegible] నును.



శాంతి శాంతి శాంతి.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B176 |
| పుస్తకం పేరు | గీతాబోధ |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | [illegible] |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehan |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |